శ్రీ శంకర భగవత్పాద విరచిత

# శివానందలహరి



భావానువాదం

భాగవతి రామమోహనరావు



ప్రకాశకులు :

జ్ఞానవికాస్ పబ్లికేషన్సు

210-3 ఆర్.టి. విజయనగర్ కాలని

హైదరాబాదు

**1992**

ప్రథమ ముద్రణ 1992 :
ప్రతులు 1000
సర్వస్వామ్య సంకలితము

మూల్యము 10-00

ప్రతులకు

జ్ఞానవికాస్ పబ్లికేషన్సు
210-B ఆర్.టి. విజయనగర్ కాలనీ,
హైదరాబాదు-500457
ఫోన్_37628

ముద్రణ :

దక్షిణ భారత ప్రెస్,
ఖైరతాబాద్, హైదరాబాదు-4

# ఉపోద్ఘాతం

ముముక్షువులైన భక్త జనుల హితార్థం ఆదిశంకరులు సౌందర్య లహరి, శివానందలహరి, మోహముద్గర, లక్ష్మీనృసింహస్తోత్రము, త్రిపుర సుందరీ మానసపూజ మొదలైన అనేక స్తోత్ర గ్రంధాలను ప్రసాదించారు. వాటిలో భక్తిరసభరితమైన ఈ శివానందలహరి మోక్షాసక్తులైన భక్త జనులకు, ఆత్మ జిజ్ఞాసులకు అమూల్యమైనది. శివారాధకులకు పెన్నిధి వంటిది.

శంకరభగవద్పాదులు రచించిన అనేక ఉద్గ్రంథాలు అనాదినుంచీ సాంప్రదాయ సాహిత్యపరమైన వ్యాఖ్యానాలతో, పండిత సరళిలో వెలుపడ్డాయి. అదే సరళిలో మరికొన్ని వస్తూనేవున్నాయి. కాని అవి ముముక్షువులైన సామాన్య సాధకులు సులువుగా అర్థం చేసుకోలేనివి. శంకరులు ప్రబోధించిన సర్వోత్కృష్టమైన అద్వైత ఆధ్యాత్మికతత్వం అందరికీ సులువుగా అవగాహనన అవకపోవడం అవాంఛనీయం. అద్వైత సిద్ధాంతం సులువుగా అవగాహన ఆయేది కాదనే భావం సామాన్య సాదకులలోనే గాక, విద్యాబుద్ధులు కలవారిలో కూడా ఏర్పడటం విచారకరం.

ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, యోగవాశిష్టం మొదలైన విశిష్ట వేదాంత గ్రంథాలన్నీ సర్వోత్కృష్టమైన అద్వైత మహాతత్వాన్నే వివరిస్తున్నాయి. సార్థక, సనాతన ఆధ్యాత్మిక తత్వమైనదాఐనే శంకర

భగవత్పాదులు అనేక విధాలుగా వారి వివిధ గ్రంథాలలో విశదం చేశారు.

ఆదిశంకరుల ఆత్మజ్ఞానప్రబోధాలను ముముక్షు వర్గానికి చెందిన సామాన్య మానవాళికి అతిసులువుగా గ్రాహ్యమయే వాడుక భాషలో అంద జేసే ఉద్దేశంతో ఇంతకు ముందు అయిదు ఆధ్యాత్మిక గ్రంథాలు మాచే ప్రచురించబడ్డాయి. ఇది ఆరవది. సక్రమ సాధనానుష్టానాల ద్వారా మోక్ష పదాన్ని సాధించడానికి జిజ్ఞాసులకు తోట్పడ్డమే ఈ గ్రంథాలకర్తవ్యం.

ఈ పవిత్ర గ్రంథంలోని శ్లోకాలను హృదయ రంజకమైన వాటి భావాలను ప్రతినిత్యమూ, ముముక్షువులైన భక్తజనులు మననం చేసుకుని వాటిలోని భక్తి మకరందాన్ని ఆస్వాదించగలరని ప్రకాశకుల ఆకాంక్ష.

హైదరాబాదు,
1-8-1992

ఇట్లు
ప్రకాశకులు

# శివానంద సౌరభం

శివుడు పరమ శాంతి స్వరూపుడు. 'శామ్యతి పరమా నంద రూపత్వా న్నిర్వికారో భవతీతి శివః' అని శివుని వర్ణిస్తారు. అంటే, బ్రహ్మానంద స్వరూపుడు నిర్వికారుడు, కనుక శమించి యుండు వాడని అర్థం.

శివుని ఆరాధిస్తే, మనః శరీరాలు నిర్మలములై, పరిశుద్ధ మౌతాయి. మనస్సు పరిశుద్ధ మైనంతనే, మనలోనే మనోతీతమై వుంటున్న పరమ శివ ప్రకాశం ప్రభావితమై మన సహజ స్వరూ పంగా భాసిత మౌతుంది.

అఖండానందమయుడు, పరమ శాంతి స్వరూపుడు అయిన ఆ శివుని మన నిర్మల హృదయ కుహరమందే కనుగొన సాధ్యము. అక్కడ తప్ప వేరెక్కడా శివుడు చిక్కడు. హృద యమే ఆ నిఖిలేశ్వరుని నివాసస్థానము. ఆ పరమ పావనుని పొందగల పవిత్ర ప్రదేశము. దేవాలయములు, మఠములు, ఆశ్రమ ములు, పుణ్యక్షేత్రములు - ఇత్యాదులన్నింటికంటె అత్యంత పవిత్ర మైనది మన హృదయమే. అట్టిభగవన్నిలయమైన హృదయాన్ని

వదలి, మాయా స్వరూపమై, నిస్సారమైన బాహ్యా జగత్తులో చేయబడే కార్యకలాపములు చివరకు అర్థ సూన్యములై నిష్ప్రయోజనములే అవుతాయి.

కంటిలోన నున్న కనుపాపరీతిగా
దేముడుండు మనదు దేహమందు।
మూఢుడెరుగలేక మూల తత్వమ్మును
బాహ్యాజగతి వెదుక బయలుదేరు॥

ఇలా యదార్థ భగవతత్వాన్ని మహాభక్తుడైన కబీరుదాసు ఎంతో సుస్పష్టంగా వ్యక్త పరచాడు.

మానవజన్మనికి అన్నిటికంటె కాలం అత్యంత విలువైంది. జీవిత కాలం ఎంతోపరిమితం. ఆద్యంత రహితమై సాగిపోతూన్న కాల ప్రవాహంలో, మానవ జీవిత కాలం ఇట్టే గడిచిపోతుంది. రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు, త్వరత్వరగా దొర్లిపోతూ, అనివార్యమైన అంత్యదశ ఆసన్న మౌతుంది. అహంకారంతో, ఏ మాత్రమూ ఆత్మతత్వం ఎరుగని అజ్ఞానాంధకారంలో, విశిష్టమైన మానవ జీవితం అస్తమిస్తుంది.

జీవరాసు లన్నింటిలో మానవజన్మ మహోత్కృష్టమైందని అందరూ ఎరుగున్నదే. పశు, పక్ష్యాదులకంటె ఎన్నో ఉన్నత శక్తులు మానవ జన్మలకు ప్రసాదింప బడినాయని అందరికీ తెలుసు. కాని అటువంటి విలక్షణమైన శక్తులయొక్క

ప్రయోజనాలను వినియోగించుకుని జీవితాన్ని సార్థకం చేసుకోక పోతే, అవి వుండటం వల్ల ఏమి ప్రయోజనం?

కాలముయొక్క విలువను గురించి శంకర భగవత్పాదులు వారి 'ప్రబోధ సుధాకరము' లో ఇలా వివరించారు :–

ఆయుః క్షణ లవమాత్రం నలభ్యే హేమకోటి భిః క్వాపి।
తచ్చేద్గచ్ఛతి సర్వం మృషా తతః కాధికా హానిః ॥

ఆయువు అత్యంత విలువైనది. కోట్లకొలదీ బంగారు నాణెములు వెచ్చించినా, క్షణకాలములో ఇసుమంతైననూ ఆయువును సంపాదించుట సాధ్యపడదు.

ఇంతటి విలువైన ఆయుర్దాయమంతా అశాశ్వతమైన ధన, దారా, పుత్రులతో కూడిన సంసారసేవనంలోనే వ్యర్థపరుస్తే అంతకంటే హానికరమైనదేముంటుంది?

మానవ జన్మనికి ఆధ్యాత్మికోన్నతియే సార్థక ప్రయోజనమని, యదార్థమైన భగవతత్త్వాన్ని అవగాహన చేసుకుని, జనన మరణ సంసార చక్రభ్రమణం నుంచి ముక్తి పొందటమే పరమ పురుషార్థమని మన మతాదేశం. అంటే, ఆవిధంగా ఆధ్యాత్మిక జీవితం అలవరచుకోని జన్మ మానవజన్మ అవదని చెప్పడం. మానవ జీవితం అనేది ఆధ్యాత్మిక జీవితానికి బీజావస్థ అని తెలుసు కోవాలి. అంటే, ఆధ్యాత్మిక సాధనారంభమే మానవ

జీవితారంభమని, ఆధ్యాత్మిక సాధనారహిత జీవితకాలం మానవ జీవిత మనిపించుకోదని అర్థం.

షడూర్మిరహితుడైన సదాశివుడు అన్ని దైవాలకంటె అగ్రగణ్యుడు. మహా మహిమాన్వితుడు. ఆయన మహత్తు బ్రహ్మాది దేవతలకు సైతం అందనిదని శంకర భగవత్పాదులు 9వ శ్లోకంలో ఎంతో చమత్కారంగా చెబుతారు. మహత్తరమైన శివ స్వరూపాన్ని దర్శించాలని ఆకాంక్షతో శ్రీమహావిష్ణువు భూమి యందు ఆయన పాదాల్ని దర్శించడానికి వరాహ (పంది) రూపాన్ని, బ్రహ్మ ఆ పరమశివుని శిరస్సును ఆకాశమందు చూడడానికి హంస రూపాన్ని ధరించి, అనేక శ్రమలు పడి, చివరకు శివుని పాదములు గాని, శిరముగాని దర్శించలేక విఫలులైనారట.

శివుడు అత్యంత కరుణామయుడు. ప్రేమ స్వరూపుడు మహాతేజస్వి జ్ఞానమే ఆయన స్వరూపము భక్తులంటే ఆయనకు అత్యధిక ఆప్యాయత. వారి శ్రేయస్సు గురించి ఆయనకు అపారమైన శ్రద్ధ. శివుని అనుగ్రహం వర్ణనాతీతం. శివభక్తి సర్వ విధములా శ్రేయస్కరం. శివధ్యానం సత్వర ఆత్మోదయ సాధకం. సాంబశివ శక్తి యొక్క మహాత్యం ఉత్తమ శివభక్తుల కందరకూ అనుభవైకవేద్యమే.

శివ ప్రసాదేన వినా న సిద్ధిః
శివ ప్రసాదేన వినా న బుద్ధిః।
శివ ప్రసాదేన వినా న యుక్తిః
శివ ప్రసాదేన వినా న ముక్తిః॥

అని శంకర భగవత్పాదులు ''సర్వవేదాంత సిద్ధాంత సార సంగ్రహం"లో శివానుగ్రహమును గురించి చెబుతారు. అంటే, శివానుగ్రహము లేనివారికి తలపెట్టిన కార్యాలు నెరవేరవు. ఆత్మ జ్ఞాన సముపార్జన కోసం సాధన చేయ్యాలనే బుద్ధి పుట్టదు. మోక్ష పదాన్ని పొందడానికి వేదాంత శాస్త్రాధ్యయనమునం దాసక్తి కలుగదు. ఇక ముక్తిని పొందే మాటే వుండదు.

కనుక శివానుగ్రహం కోసం అనవరతమూ ఆయనను స్మరిస్తూండడం, ఆరాధిస్తూండడం అలవరచుకోవాలి. ఏ పని చేస్తున్నా, కష్టములు, దుఃఖములు వచ్చినా, శరీరమునకు ఎటువంటి వ్యాధులు, రుగ్మతలు సంక్రమించినా శివ స్మరణ మానకుండా అనవరతమూ సాగిస్తూనే వుండాలి.

శ్రద్ధా భక్తులతో శివస్మరణ ఇలా అలవాటు చేసుకుంటే, అంత్యకాలంలో అతిసునాయాసంగా శివస్మరణతో ఈ దేహాన్ని వదలి వేయగలుగుతారు. మరణసమయంలో భగవన్నామ స్మర

ఙతో దేహాన్ని విడిచినవారు భగవంతునిలో ఐక్యమై ముక్తి పథాన్ని పొందుతారని భగవద్గీతలో చెప్పబడిందికదా!

భక్తి అంటే అన్యమెుల్లని దైవచింత. నిరంతరం ఆ చింతనలోనే నిమగ్నుడై వుండడం. అంటే భగవంతుని చింతన ఒక్కటే తప్ప ఇక ఏ తలంపులూ మనస్సులో మసలకూడదని. భక్తి స్వరూపం ఎట్టిదో శంకర భగవత్పాదులు 61వ శ్లోకంలో ఎన్నో ఉపమానాలతో ఇలా చెబుతారు: నేలపై రాలిపోయిన ఊడుగ విత్తనాలు తిరిగి ఆ చెట్టుకే అంటుకొనేటట్లును, సూది అయస్కాంతం దరికిపోయి దానినంటుకొని వుండేవిధంగాను, పతివ్రత తనభర్తను, తీగ వృక్షమును, నది సముద్రమును పొంది నట్లునూ, చిత్తము ఎల్లప్పుడూ, ఆ పసుపతి పాదారవిందములను పొంది, అక్కడే స్థిరంగా ఉండి పోవడమే భక్తి అని చెప్పబడింది. అలా దైవచింతనలో నిమగ్నుడైనవాడు శివాధీను డౌతాడు. శివాధీనుడంటే ఆత్మాధీనుడు. ఆత్మతో ఏకమై తన అహంకారభావాన్ని పోగొట్టుకున్నవాడు. ఇలాటి ఉన్నతమైన భక్తి జ్ఞానోత్పత్తికి దోహద మౌతుంది. తాను భగవంతుని కంటె వేరైన భక్తుడి నను కొనే అహంకార భావం అంతమైన వెంటనే, జ్ఞానోదయ మైందని అనుభవం కలుగుతుంది. ఇటువంటి ఉన్నత స్థితిని పరాభక్తి అంటారు. పరాభక్తి, జ్ఞానం ఒక్కటే. భక్తుడూ, భగవంతుడూ

(ధ్యాత, ధ్యేయము) ఏకమైన స్థితియే పరాభక్తి. ఇక, తెలియదగినదీ, సాధించ వలసినదీ ఏమీ వుండదు. ఉన్నదంతా చైతన్యమయమైన ఆత్మానుభవం ఒక్కటే. ఈ చైతన్య మహానుభవమే శివానంద సౌరభం.

శివం సత్యం శివం నిత్యం
శివం సర్వం సదాశివం
అహం సత్యం అహంనిత్యం
అహం సతతం శివోహం॥

హైదరాబాదు
1-8-1992

ఇట్లు
భాగవతి రామమోహన రావు

# ప్రార్థన

వందే శంభు ముమాపతిం సురగురుం
వందే జగత్కారణం

వందే పన్నగభూషణం మృగధరం
వందేపశూనాం పతిమ్

వందే సూర్యశశాంక వహ్నినయనం
వందే ముకుందప్రియం

వందే భక్తజనాశ్రయం చ వరదం
వందే శివం శంకరం



శంకర భగవత్పాద విరచిత

# శివానందలహరి



ఓం

## శంకర భగవత్పాద విరచిత

# శివానందలహరి

1. శ్లో॥ కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటిత ఫలాభ్యాం భవతు మే
శివాభ్యా మస్తోక త్రిభువన శివాభ్యాం హృది పున
ర్భవాభ్యా మానంద స్ఫురదనుభవాభ్యాం నతి రియమ్.

2. శ్లో॥ గళంతీ శంభో! త్వచ్చరిత సరితః కిల్బిష రజో
దళంతీ ధీకుల్యాసరణిషు పతంతీ విజయతామ్
దిశంతీ సంసార భ్రమణ పరితా పోపశమనం
వసంతీ మచ్చేతోహ్రదభువి శివానందలహరీ॥

ఓం

## శంకర భగవత్పాద విరచిత

# శివానందలహరి

1. సర్వవిద్యా స్వరూపులు, శిరమునందు చంద్రవంకను ధరించిన వారు, తపస్సుచే పరిపూర్ణత పొందినవారికి ఫలస్వరూపులు, తమను భజించు భక్తులకు శుభములను, పురుషార్థములను ప్రసాదించువారు, సర్వలోక వాసులకు శ్రేయస్సు కలుగజేయువారు, చిత్తశుద్ధితో ధ్యాన నిష్ఠులైన వారి హృదయములందు సాక్షాత్కరించువారు, స్వస్వరూప స్ఫురణయందానందానుభవముతో ప్రకాశించువారు అయిన పార్వతీ పరమేశ్వరులకు నమస్కారము.

2. సమస్త సుఖప్రదాతవైన ఓ శంభూ! నదులు భూమిపై ప్రవహించుట వలన జీవకోటికి తాపములు శమించి, పంటలతో పొలములు సస్యశ్యామలములై, ప్రజలకు అనేక సుఖ శౌభాగ్యములెట్లు కలుగుచున్నవో ఆ ప్రకారమే ఈ శివానందలహరి అనే అమృత వాహినిని శ్రద్ధాభక్తులతో పఠించు వారికి, వినిన వారికి, వ్రాసినవారికి, సకల సంసార తాపములు సమసిపోయి, సమస్త పాపపంకిలములు హరించి, హృదయమున మహానందము కలుగును.

3. శ్లో॥ త్రయీవేద్యం హృద్యం త్రిపురహర మాద్యం
త్రి నయనం
జటాభారోదారం చలదురగహారం మృగధరమ్
మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిం
చిదాలంబం సాంబం శివ మతివిడంబం హృది భజే॥

4. శ్లో॥ సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదాః
న మన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృత(త)ఫలమ్,
హరి బ్రహ్మాదీనా మపి నికటభాజా మసులభం
చిరం యాచే శంభో! శివ! తవ పదాంభోజ భజనమ్॥

5. శ్లో॥ స్మృతౌ శాస్త్రే వైద్యే శకున కవితాగాన ఫణితౌ,
పురాణే మంత్రే వా స్తుతినటనహాస్యే ష్వచతురః
కథం రాజ్ఞాం ప్రీతిర్భవతి మయి కోఽహం పశుపతే!
పశుం మాం సర్వజ్ఞ! ప్రథిత కృపయా పాలయ విభో!

3. వేద వేదాంగములైన ప్రస్థానత్రయమందు ప్రతిపాదింపబడిన వాడు, మాయా జనితములైన త్రిపురములనబడు స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను నశింపజేయువాడు, మూడునేత్రములుగలవాడు, భారమైన జడలు ధరించిన గంభీర స్వరూపుడు, మెడలోను, శిరమునందు సర్ప ములు హారములుగా గలవాడు, లేడి చర్మమును ధరించినవాడు, నిత్యా నంద స్వరూపుడు, దైవములందరిలోనూ అగ్రగణ్యుడు, సృష్టికంతటికీ పాలకుడు, లోక కళ్యాణమునకు కారకుడు అయిన సాంబశివుని నా హృదయకుహరమం దెల్లప్పుడూ ధ్యానించుచూ శివానందమును పొందును.

4. లోకములో వేలకొలది క్షుద్రదేవతలు ఉంటున్నప్పటికీ, వారి నెవరినీ నేను కలలోనైనను కొలవను. వారి వలన పొందదగిన తుచ్ఛ సుఖములను, ఫలములనుతలచనైనను తలచను. నీకు దగ్గరలోనున్నహరి బ్రహ్మాది దేవతలకు సైతము దుర్లభమైన నీపాదారవిందముల యొక్క సేవయే నేను ఎల్లప్పుడూ చిరకాలమునుండి యాచించుచున్నాను. కనుక, ఓ శంభో! నీ పాద పద్మములను భజించునట్లు నన్ననుగ్రహింపుము.

5. స్మృతులందు, ధర్మశాస్త్ర సమూహమునందు, తర్కవ్యాకరణాది శాస్త్రములందు, వైద్యశాస్త్రమునందు, శకున శాస్త్రమునందు, సంగీత సాహిత్యములయందు, వాక్చాతుర్యమందు, పురాణములయందు, మంత్ర శాస్త్రమునందు, ఇతరులను రంజింపజేయు హాస్యమునందు నేను సమర్థు డను గాను. వీటిలో దేనియందూ నాకు నిపులేదు. వీటి నభ్యసించి, వాటి వలన, రాజుల ప్రాబల్యమునుపొంది కుటుంబ పోషణ చేసికొను అభిలాష నాకులేదు. కావున, సర్వజ్ఞుడవైన సాంబశివా! అసమర్థుడను, అజ్ఞానిని అయిన నేనునీ కరుణా కటాక్షముల కొరకే ప్రార్థించుచున్నాను. కావున ఓ పశుపతీ! దయతో నన్ను రక్షింపుమా!

6. శ్లో॥ ఘటోవా మృత్పిండో వాఽప్యణు రపిచ ధూమోఽగ్ని రచలః
పటో వా తంతు ర్వా పరిహరతి కిం ఘోరశమనమ్
వృథా కంఠక్షోభం వహసి తరసా తర్కవచసా
పదాంభోజం శంభో ర్భజ పరమసౌఖ్యం వ్రజ సుధీః॥

7. శ్లో॥ మన స్తే పాదాబ్జే నివసతు వచః స్తోత్ర ఫణితౌ,
కర శ్చాభ్యర్చాయాం శ్రుతి రపి కథాకర్ణనవిధౌ
తవ ధ్యానే బుద్ధి ర్నయనయుగళం మూర్తివిభవే,
పరగ్రంథా న్కైర్వా పరమశివ! జానే పర మతః॥

8. శ్లో॥ గభీరే కాసారే విశతి విజనే ఘోర విపినే
విశాలే శైలే చ భ్రమతి కుసుమార్థం జడమతిః
సమ ర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ! భవతే.
సుఖే నావస్థాతుం జన ఇహ న జానాతి కి మహో,

6. ఓయి బుద్ధిమంతుడా! కుండలు తయారు చేయుట మట్టిముద్దవలన జరుగునా లేక అణుసంయోగము వల్ల జరుగునా? కొండ మీద పొగ బయలుదేరుటకు అగ్నియే కారణమగునా? వస్త్రము యేర్పడుటకు దారపు పోగులే కారణమగునా? ఇలాటి లౌకిక విషయములను గూర్చి తర్క వితర్కములతో కంఠశోభ చేసికొనుచు కాలము వృథాచేసుకొనుట వలన ఘోరమైన సంసార విపత్తు నివారింపబడి శాంతి, లభించదు. కనుక ఇటువంటి విషయముల జోలికి మనసును బోనీయక, సతతము శివుని పాద పద్మములను భజియించుచు పరమార్థ సౌఖ్యమును బొందుమా!

7. ఓ పరమశివా! నీ పాదపద్మముల ధ్యానమందే నా మనస్సు ఎల్లప్పుడూ నియుక్తమై నిలిచియుండునట్లనుగ్రహింపుము. నా వాక్కును నీ మహిమను గురించి సతతమూ స్తోత్రము చేయుటయందు నియోగింపుము. నా చెవులు నీ పవిత్ర చరితములను వినునట్లు చేయుము. నా బుద్ధి నిరంతరము నీ ధ్యానములో నిమగ్నమై యుండున ట్లనుగ్రహింపుము. నానేత్రములు నీ మహోన్నత వైభవమును గాంచునట్లు ప్రసాదింపుము. ఈ విధముగా, మనో,బుద్ధి, వాక్కాయ కర్మములద్వారా భగవదారాధన చేయుటతో, ఇతర గ్రంథములతో నాకు పని యేమున్నది?

8. ఉమాపతివైన ఓ సదాశివా! మూఢుడైన మానవుడు, నిన్ను పూజించుట కొరకు అనేక రకములైన పుష్పములను సేకరించ వలెనని లోతైన తామర కొలనులలోనికి దిగుచు, వ్యాఘ్రాది క్రూరమృగములతో కూడిన భయంకరమైన అరణ్యముల లోనికి, విశాలమైన కొండలమీదకూ పోయి పరిభ్రమించుచూ ఎంతో విలువైన కాలమును వృథాగా గడిపి వేయుచున్నాడు. ఈ తాపత్రయములకు బదులు, ఒకటైనటువంటి తన హృదయ కమలమునే నీకు సమర్పించి, సుఖముగ ఒకచోట నిన్ను కొలుచుచూ నిశ్చలముగా నుండుట మేలని గుర్తెరుంగడు కదా! ఎంత ఆశ్చర్యము?

9. శ్లో॥ యథా బుద్ధి శ్శుక్తౌ రజత మితి, కాచాశ్మని మణిః,
జలే పైష్టే క్షీరం, భవతి మృగతృష్ణాసు సలిలమ్,
తథా దేవ భ్రాంత్యా భజతి భవదన్యం జడజనో
మహాదేవేశం త్వాం మనసి చ న మత్వా పశుపతే!

10.శ్లో॥ నరత్వం దేవత్వం నగవన మృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాది జననమ్;
సదా త్వత్పాదాబ్జ స్మరణ పరమానందలహరీ
విహారాసక్తం చే ద్ధృదయ మిహ కిం తేన వపుషా?

11.శ్లో॥ వటు ర్వా గేహీ వా యతి రపి జటీ వా తదితరో
నరో వా యఃకశ్చి ద్భవతు భవ! కిం తేన భజసి
యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే!
తదీయ స్త్వం శంభో! భవసి భవభారం చ వహసి॥

9. హే మహాదేవేశా! అజ్ఞానముచే మూఢుడైన మానవుడు ముత్యపు చిప్పను గాంచి అది వెండియని అపోహపడుచుండును; గాజు ముక్కను జూచి అది విలువైన మణియని భ్రాంతినొందు చుండును ; పిండి కలిపిన నీళ్ళను గాంచి అవి పాలని భ్రమపడుచుండును. ఎండమావులనుజూచి అవి నీటి తటాకములని భ్రాంతి జెందు చుండును. ఈ ప్రకారమే సర్వసృష్టికి కర్తవైన పరమేశ్వరుడవగు నీ స్వరూపమును తెలిసికొనలేని వాడైన మూఢుడు, తన హృదయమందుండు సత్యస్వరూపుడవైన నిన్ను తెలుసు కొనజాలక, నీకంటె అన్యులైన ఇతర దేవతలను కొలుచుచున్నాడు.

10, పూర్వ జన్మమునందు చేయబడిన పుణ్యపాప కర్మముల ననుస రించి, ఈ జన్మమందు మనుష్యునిగనో, దేవతగనో, పశుపక్ష్యాదులలో దేనిగనో, కీటకముగనో జన్మించుట సంభవించుచుండును. ఈ విధముగా ప్రారబ్ధవశమున సంభవించు ఏ జన్మమందైనవ్వటికినీ నీ చరణార విందములందు భక్తికలిగి, నీయొక్క ధ్యానానంద ప్రవాహమునందు మునకలు వేయుచు విహరించుచుండెనేని, నీ యనుగ్రహమును బొంది ధన్యుడగుట తథ్యము.

11. బ్రహ్మచర్యము, గృహస్థము, వానప్రస్థము, సన్యాసము అను ఈ నాలుగు ఆశ్రమముల యందుండు వారలలో, ఎవరైననేమి? ఈ ఆశ్రమముల వలన ఏమి ప్రయోజనమున్నది? సకల భూతాధిపతివైన ఓ సాంబశివా! భక్తితో ఎవని హృదయకమలము నీకర్పింపబడినదో వానికి నీవత్యంత ఆప్తుడవై స్వాధీనుడవై యుందువు. ఇంతేకాక, వాని సంసారభారమంతా నీవే భరించుచున్నావు.

12 శ్లో॥ గుహాయాం గేహే వా బహి రపి వనే వాద్రిశిఖరే
జలే వా వహ్నౌ వా వసతు వసతేః కిం వద ఫలమ్
సదా యస్యై వాంతః కరణమపి శంభో! తవ పదే
స్థితం చే ద్యోగోసౌ, స చ పరమయోగీ చ న సుఖీ.

13. శ్లో॥ అసారే సంసారే నిజభజన దూరే జడధియా
భ్రమంతం మా మంధం పరమకృపయా పాతు ముచితమ్
మదన్యః కో దీన స్తవ భవతి? రక్షా తినిపుణః
త్వదన్యః కో వా మే త్రిజగతి శరణ్యః పశుపతే!

14. శ్లో॥ ప్రభు స్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే!
ప్రముఖ్యోఽహం తేషా మపి కిముతబంధుత్వ మనయోః
త్వయైవ క్షంతవ్యాః శ్శివ! మదపరాధాశ్చ సకలాః
ప్రయత్నా త్కర్తవ్యం మదవన మియం బంధుసరణిః॥

12. గుహాలయందుండిననేమి? బహిరంగప్రవేశములందుగాని, వనము లందుగాని, పర్వత శిఖరములందుగాని, పంచాగ్నుల మధ్య గాని, నీటి యందు గాని ఎచటనుండి తపము చేయుచున్న ఏమి ప్రయోజనము గలదు? ఓయీ! సాంబశివా! ఎవని మనస్సుఎల్లవేళలా నీ చరణారవింద ములయందు స్థిరముగా నిలిచియుండునో, అతడు చేయునదే యదార్థ మైన ధ్యానయోగము. అట్టివాడే మహాయోగి. శాశ్వతానంద భరితుడు.

13. ఓయీ! సకల భూతాధిపతివైన ఓ సాంబశివా! సారహీనమైన సంసారమందు మునిగియుండి, స్వస్వరూపమే అయివున్న పరమేశ్వరుని తెలిసికొన జాలక, జ్ఞానహీనుడనై తిరుగాడుచు, గ్రుడ్డివానివలెనున్న నాకంటె దీనుడగు అన్యుడు ఎవడునీకు రక్షించదగిన వాడగును? దీను లను సంరంక్షించుట యందు మిక్కిలి సమర్థుడవైనవాడవగు నీకంటె ఇతరులెవరును, ముల్లోకముల యందును నన్ను రక్షించదగినవారులేరు. కనుక, నేనునీవాడనని ఎంచి, దయతో నన్ను తప్పక రక్షించుట నీకు ఉచితము.

14. ఓ ఈశ్వరుడా! ముల్లోకములకు ప్రభువైన నీవు దీనులను రక్షిం చుటకు వారికి పరమబంధువుడవు కదా! దీనులలో నేను మొట్టమొదటివాడ నాయె. కనుక, మన ఇరువురకుగల సన్నిహిత బాంధవ్యము చెప్పనవస రములేదు. దీనుడనైన నా సర్వాపరాధములను మన్నించి, నన్ను రక్షిం పుము. ఇదియే బంధువులు ఒకరిపట్ల ఇంకొకరు ప్రవర్తించెడు మార్గము.

15. శ్లో॥ విరించి ర్దీర్ఘాయు ర్భవతు భవతా తత్పరశిర
శ్చతుష్కం సంరక్ష్యం న ఖలు భువి దైన్యం లిఖితవాన్
విచారః కోవా మాం విశదకృపయా పాతి శివ ! తే
కటాక్షవ్యాపార, స్స్వయమపి చ దీనావనపరః.

16. శ్లో॥ ఉపేక్షా నోచేత్ కిన్న హరసి భవద్ధ్యానవిముఖాం
దురాశాభూయిష్ఠాం విధిలిపి మశక్తో యది భవాన్
శిరస్తద్వైధాత్రం నచ ఖలు సువృత్తం పశుపతే !
కథం వా నిర్యత్నం కరనఖముఖేనైవ లులితమ్ ॥

15. శుభంకరుడవైన ఓ సదాశివా! బ్రహ్మదేవుడు దీర్ఘాయుష్మంతుడై యుండుగాక! బ్రహ్మయొక్క ఐదు శిరస్సులలో ఒకదానిని నీవు త్రుంచి వేసితివిగదా! మిగిలిన నాలుగు శిరములను త్రుంచివేయక అటులనే యుంచుము. అవి రక్షింపతగ్గవి. ఎందువలననగా ఆ బ్రహ్మ అందరి నొసటా దీనత్వమును వ్రాయుచుండును గదా! నీకరుణా కటాక్ష వీక్షణ మాత్రముననే ఆ దీనత్వమంతా తొలగి పోవును. అందువలన బ్రహ్మ రాతను గూర్చి ఎవరూ భయపడనవసరములేదు. కాని, అలా దీనత్వ మును ఎవరినొసటను వ్రాయువారు లేనిచో దీనులేవుండరుగదా! దీనులను నీకటాక్షముచే రక్షించు కార్యము కలుగనేరదు. కనుక, నీకటాక్షము మామీద ప్రసరించుటకు, బ్రహ్మ మా నొసట దీనత్వము వ్రాయుచుండ వలెను. అందుచే బ్రహ్మ దీర్ఘాయుష్మంతుడు కావలయును. దానివలన విచారమేమున్నది?

16. ఓ సాంబశివా! నా నొసట దీనత్వము, దురాశ మున్నగునవి వ్రాయబడి యుండుట వలన నాకు నీ ధ్యానమందు ఉపేక్ష యేర్పడినది. అనేక దుష్టకోరికలు, ఆశలు జనించుచున్నవి. కనుక, నా నొసటియం దున్న యీ బ్రహ్మరాతను నీవు ఏల పోగొట్టవు? నీవు మహాసామర్థ్యము గలవాడవు కదా? అతిసులువుగా ఎవరికీ శక్యముకానిదైన బ్రహ్మయొక్క అయిదవశిరస్సుకు కొనగోటితో త్రుంచివేసితివే! ఇట్టి మహాసమర్థుడవైన నీవు నా నొసటనున్న బ్రహ్మలిపిని దుడిచి, నాకు నీ ధ్యానమందాసక్తి కలుగ జేసి, నన్ను రక్షింపుమా!

17.శ్లో॥ ఫలాద్వా పుణ్యానాం మయి కరుణయా వా త్వయి విభో!
ప్రసన్నేఽపి స్వామిన్ ! భవదమలపాదాబ్జయుగళమ్
కథం పశ్యేయం మాం స్థగయతి నమస్సంభ్రమజుషాం
నిలింపానాం శ్రేణి ర్నిజకనక మాణిక్యమకుటైః

18.శ్లో॥ త్వమేకో లోకానాం పరమఫలదో, దివ్యపదవీం
వహంతస్త్వన్మూలాం పున రపి భజంతే హరిముఖాః
కియద్వా దాక్షిణ్యం తవ శివ ! మదాశా చ కియతీ
కదా వా మద్రక్షాం వహసి కరుణాపూరితదృశా?

17. సర్వబ్రహ్మాండములకు, సకల దేవతలకు ప్రభుడవైన ఓ సదాశివా! నేను సంపాదించుకొనిన పుణ్యఫలమువల్ల నా మీద నీకు కలిగిన వాత్సల్యముచే నన్ననుగ్రహించి, నీ పాదారవిందములను దర్శించు మహాభాగ్యము నాకు కలుగజేసితివి. కాని నీదర్శనార్థమై నీచుట్టూ తండోపతండాలుగా దేవతా గణములు సువర్ణమయ రత్నఖచిత కిరీటములతో మెరిసిపోవుచూ నీ కడ్డముగా నిలిచి, నిన్ను కప్పివేయుచున్నారు గదా! నేనెట్లు నీ స్వచ్ఛమైనట్టి పాదారవిందములను దర్శించగలనో గదా!

18. ఓ సాంబశివా! లోకములో సర్వ ధర్మార్థకామములను మించి నటువంటి ఉత్తమమైన మోక్షపదమును మానవులకు ప్రసాదింపగల వాడవు నీ వొక్కడవేకదా! వైకుంఠాది లోకములలో ఎంతో ఉన్నత స్థితిలోనున్న విష్ణువు, బ్రహ్మ మొదలగు దైవస్వరూపులందరూ వారి వారి పదవులతో తృప్తినొందక, అంతకు మించిన ఫలమును పొందుట కొరకు నిన్ను విశేషమైన భక్తిశ్రద్ధలతో సేవించుచున్నారు. నీకు భక్తుల యెడ గల దయ, ప్రేమ అపారము. కనుక నన్ననుగ్రహించి నాకు మోక్ష ప్రాప్తి కలుగజేయుమా!

19. శ్లో॥ దురాశాభూయిష్ఠే దురధివగృహద్వారఘటకే
దురంతే సంసారే దురితనిలయే దుఃఖజనకే
మదాయాసం కిం న వ్యపనయసి కస్యోపకృతయే
వదేయం ప్రీతిశ్చే త్తవ ఖలు కృతార్థో వయ మపి.

20 శ్లో॥ సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నట త్యాశాశాఖా స్వటతి ఝడితి స్వైర మభితః
కపాలిన్ ! భిక్షో ! మే హృదయకపి మత్యంతచపలం
దృఢం భక్త్యా బద్ధ్వా భవదధీనం కురు విభో !

21. శ్లో॥ ధృతిస్తంభాధారాం దృఢగుణనిబద్ధాం సగమనాం
విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివస సన్మార్గఘటితామ్
స్మరారే ! మచ్చేతస్స్ఫుట పటకుటీం ప్రాప్య విశదాం
జయ స్వామిన్ ! శక్త్యా సహ శివగణై స్సేవిత! విభో !

19. సంసారమందలి వ్యామోహము దురాశా భూయిష్ఠమైనది. దిఇ ఎంతటి నీచమైనపనినైనను చేయించును. అవివేకముతో దుష్టులైన రాజుల ఇండ్ల ద్వారములవద్ద పడికాపులు పడి వారనుగ్రహించు ధన, కనక, వస్తువాహనముల కొరకు చేయరాని పనులు చేయుచు, మనుజులు దుఃఖమయమైన భ్రమలో మునిగి యున్నారు. ఇట్టి దుఃఖ భూయిష్ఠమైన సంసార కూపములో నేను మిక్కిలి శ్రమపడుచున్నాను. కాని సృష్టికర్తయైన బ్రహ్మ మీదగల వాత్సల్యముచే, నీవు నన్ను ఉపేక్ష చేయుచున్నావు. నీ వాత్సల్యగుణము నామీద ఎప్పుడో ఒకప్పుడు తప్పక ప్రసరించి నాకు మోక్ష సిద్ధి కలుగునని నమ్మకము కలిగియున్నాను.

20. ఎంతో చంచలమైనదై, స్వేచ్ఛగా గంతులు వేయుచూ కోతి చెట్ల మీద ఎలా తిరుగుచుండునో, అలాగే నా మనస్సు ఎల్లప్పుడూ చంచలమైనదై విషయవాంఛలతో పరిభ్రమించుచూ, స్త్రీల స్తనగిరులయందు చరిస్తూ వుండును. ఆలు బిడ్డలనే చెట్టు కొమ్మలమీద తిరుగుతూ మోహమనే అరణ్యములో సంచరించుచుండును. సర్వవ్యాపకుడవై జగత్తంతా నిండియున్న ఓ పరమశివా! ఆదిభిక్షుకుడా! చపలత్వంతో స్వేచ్ఛగా తిరుగాడే నా మనస్సునెడి ఈ మర్కటమును పట్టుకొని, దృఢమైన భక్తి అనే త్రాటితో బంధించి, నీ స్వాధీనము చేసికొనుమా!

21. మన్మధుని ధహించిన కామవిజేతా! సర్వలోకాధిపతివై, ప్రథమ గణములచే శేవింపబడే స్వామీ! సదాశివా! నిత్యానందస్వరూపుడవైన ఓ పరమేశ్వరా! ధైర్యమనే స్తంభము ఆధారమైనదై, సత్వరజస్తమో గుణములనే దృఢమైన త్రాళ్ళచే గట్టబడి, నలుదేసలా సంచరించుచూ, విషయవాసనలనే రంగు రంగులతో గూడి, తామరపువ్వుల చిత్రములతో తయారై, రాజమార్గమందు ప్రతినిత్యము బ్రహ్మస్వరూప విచారముచే నిర్మలమైన నా చిత్తమనెడి పటకుటీరము (గుడారము) లో పార్వతీ సమేతుడవై నిరంతరము, నిత్యానంధముతో నివశించి యుండుమా!

22.శ్లో॥ప్రలోభాద్యై రర్థాహరణపరతంత్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్తస్సన్ భ్రమతి బహుధా తస్కరపతే ।
ఇమం చేతశ్చోరం కథ మిహ సహే శంకర! విభో ।
తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపామ్ ।

28 శ్లో॥కరోమి త్వత్పూజాం సపది సుఖదో మే భవ విభో ।
విధిత్వం విష్ణుత్వం దిశసి ఖలు తస్యాః ఫల మితి
పునశ్చత్వాం ద్రష్టుం దివిభువి వహన్ పక్షిమృగతా
మదృష్ట్వా తత్ఖేదం కథ మిహ సహే శంకరవిభో ।

22. ఓ భక్తజన ప్రియుడా! సర్వవ్యాపకుడవైన సదాశివా! నా మనస్సు, ధనాసక్తితో, లోభగుణము శృతి మించుటచే, అబద్ధము లాడుచూ, అనేక ఉపాయములతో భాగ్యవంతుల గృహములలోని ధనమును తస్కరింప వలెనని కుతంత్రములు పన్నుచుండును. ధనాంధకారముతో, ఇటువంటి దుర్మార్గపు చర్యలకు పూనుకొను నామనస్సనెడి ఈ దొంగనునే నెట్లు సహించగలను? కావున, నిరపరాధినైన నాయందు కరుణించి, నా మనస్సనే ఈ దొంగను, నీ అధీనములో వుంచుకొని, దానిని సంస్కరింపుమా.

23. సర్వ శుభంకరుడవైన సాంబశివా! నేను నిరంతరము భక్తి శ్రద్ధలతో నిన్నారాధించుచున్నాను. దానికి ఫలముగా నాకు బ్రహ్మత్వము గాని, విష్ణుత్వముగాని నీవు ప్రసాదింతువేమో! అదినాకు చాలా కష్టము కలిగించగలదు. ఈ పదవులు పొందవలెననే అభిలాష నాకెన్నడూలేదు. బ్రహ్మత్వము లభించిన, నిన్ను పొందుటకు పక్షిజన్మయైన హంసగా పుట్టి, ఆకాశమందలి ఊర్ధ్వలోకములన్నీ వెదకవలసివచ్చును. విష్ణు పదము లభించెనేని, నీ కోసము పందిజన్మమెత్తి అధోలోకాదులన్నీ గాలించే దౌర్భాగ్యదశ నాకు కలుగును. కాబట్టి బ్రహ్మ విష్ణు లోకాలలోని సుఖాదులకోసము ఈ దుఃఖమును నేనెట్లు సహించగలను? నాకు సత్యము, శాశ్వతము అయినదీ, బ్రహ్మాది దేవతలకు కూడా దుర్లభమైనదీ, అయిన నీ సాయుజ్యపదమే (అంటే ముక్తియే) ప్రసాదింపుమా!

24.శ్లో॥కదా వా కైలాసే కనకమణిసౌధే సహగణై
ర్వసన్ శంభోరగ్రే స్ఫుటఘటితమూర్ధాంజలిపుటః
'విభో ! సాంబ ! స్వామిన్ పరమశివ ! పా'హీతి నిగదన్
విధాతౄణాం కల్పాన్ క్షణమివ వినేష్యామి సుఖతః.

25.శ్లో॥ స్తవైర్బ్రహ్మాదీనాం, జయ జయవచోభి ర్నియమినాం
గణానాం కేళీభి, ర్మదకలమహోక్షస్య కకుది,
స్థితం నీలగ్రీవం త్రిణయన ముమాశ్లిష్టవపుషం.
కదా త్వాం పశ్యేయం కరధృతమృగం ఖండపరశుమ్॥

26.శ్లో॥ కదావా త్వాం దృష్ట్వా గిరిశ! తవ భవ్యాం ఘ్రియుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్
సమాశ్లి ష్యాఘ్రాయ స్ఫుటజలజగంధాన్ పరిమళా
నలభ్యాం బ్రహ్మాద్యైర్ముద మనుభవిష్యామి హృదయే॥

24. సాంబశివుడు తన నివాసస్థానమైన కైలాస పర్వత శిఖరము మీద బంగారముతోను, మణులతోను కట్టబడినటువంటి దివ్యభవనములో అంబికాదేవితో కూడ వున్నప్పుడు, ప్రమథగణాలు పరివేష్టించి కొలువు దీరి ఆ కైలాసవాసుని సేవిస్తూవుండగా, నేను ఆ పరివారములో జేరి, శిరస్సుమీద దృఢముగా జోడించిన బద్ధాంజలితో 'ఓ ప్రభూ! సాంబా! స్వామీ! పరమశివా! నన్ను రక్షింపుమా'! అని ప్రార్థిస్తూ, ఆ భక్తి పారవశ్యములో కలిగిన సుఖానుభవంవల్ల, అనేక బ్రహ్మకల్పాలను క్షణమాత్రంగా ఎప్పుడు గడపగలనో కదా!

25. బ్రహ్మాది దేవతలచేత సతతమూ చేయబడే స్తోత్రాలు స్వీకరించుచూ, ఋషులు, యోగీశ్వరులు తన్మయానందముతో నీకు చేయుచున్న జయ జయధ్వానాలను వింటూ, మూడు కన్నులు గలవాడవు, నీలకంఠుడవు, ఒక హస్తమందులేడిని, ఇంకొక హస్తమందు గండ్రగొడ్డలిని ధరించి, పార్వతీదేవిచే ఆలింగనము చేయబడి, ముచ్చటగా వృషభ వాహనారూఢుడవై యున్న నిన్ను నేనెప్పుడు చూడగలనో కదా! ఆ పరమానంద ప్రాప్తి నాకెపుడు కలుగునో కదా!

26. ఓ గిరినివాసా! పరమశివా! నిన్ను దర్శించి, శుభంకరములైన నీ పాదయుగళములకు వందనాదులనర్పించి, వానిని నాహస్తములచే గ్రహించి, శిరమునందుంచుకొని, కన్నులకద్దుకొని, దక్షమునందు ప్రేమతో ఉంచుకొనుచు, భక్తితో కౌగించుకొనుచు, ఆపాద పద్మముల నుండి వెదజల్లెడు పరిమళముమ వాసన చూచుచూ, సంతోష పారవశ్యము నొంచూ, బ్రహ్మాదులకు గూడ పొందశక్యముగాని, అ మహదానందము నాకెప్పుడు కలుగునో కదా!

27.శ్లో॥ కరస్థే హేమాద్రౌ గిరిశ! నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజామర సురభిచింతా మణిగణే
శిరస్థే శీతాంశౌ చరణయుగళస్థేఖిలశుభే
కమర్థందాస్యేహం భవతు భవదర్థం మమ మనః॥

28.శ్లో॥ సారూప్యం తవ పూజనే, 'శివ! మహాదేవేతి' సంకీర్తనే
సామీప్యం, శివభక్తిధుర్యజనతాసాంగత్య సంభాషణే
సాలోక్యం, సచరాచరాత్మకత మధ్యానే భవానీపతే!
సాయుజ్యం–మమ సిద్ధ మత్ర భవతి స్వామిన్! కృతా
రో స్మ్యహమ్.

27. ఓ కైలాస వాసా! సాంబశివా! స్వామీ! నీ చేతి యందు మేరు పర్వతము (బంగారు కొండ)ను, నీ సన్నిధిని ధనాధిపతియగు కుబేరుడును, నీ గృహమునందు సమస్త కోరికలను తీర్చు కల్పవృక్షమును, కామధేనువును, చింతామణియును, నీ శిరమునందు భూషణముగా చంద్రుడును, నీ రెండు పాదపద్మములయందు సకల శుభములను కలిగి, సర్వసౌభాగ్యములతో వెలయుచున్న నీకు నేనేమి సమర్పింపగలను? కనుక, నా మనస్సునే నీకు సమర్పించుచు, సర్వదా నీ ధ్యానమునందే ఆసక్తి కలిగి యుందును. దానిని దయతో స్వీకరించి, నన్ను కృతార్థుని జేయుమా!

28. ఉమాపతివగు ఓ సాంబశివా! నీ పూజచేయుచుండగా పవిత్రమైన నీ రూపము నాకు కలిగి సారూప్యమనెడి సిద్ధిని నేను పొందు చున్నాను; నీ నామస్మరణ, సంకీర్తనాదులు చేయునపుడు, నీ సామీప్యమనెడి మహాభాగ్యము నాకు కలుగుచున్నది. నీ భక్త జనులతోకూడి సాంగత్యము, శివ కథా కాలక్షేపము, జరుగుచుండగా, నీ సాన్నిధ్య సాలోక్యము నాకు లభించుచున్నది. సకల చరాచరముల యందెల్లప్పుడూ వ్యాపించి యుండు నీ దివ్యమంగళ రూపమును ధ్యానము చేయగా ఈ జన్మమందే నాకు సాయుజ్య పదవి కలుగుచున్నది. ఇట్లు సారూప్యము, సామీప్యము, సాలోక్యము, సాయుజ్యము అను నాలుగు విధములైన ముక్తులు నాకు నీ కృపాకటాక్షముల వల్ల లభించుచున్నవి.

29. శ్లో॥ త్వత్పాదాంబుజ మర్చయామి పరమం త్వాం చింతయా
మ్యన్వహం
త్వామీశం శరణం వ్రజామి, వచసా త్వామేవయాచే, విభో
వీక్షాం మేదిశ చాక్షుషీం సకరుణాం దివ్యైశ్చిరం ప్రార్థితాం
శంభో! లోకగురో! మదీయమనస స్సౌఖ్యోపదేశం కురు॥

30. శ్లో॥ వస్త్రోద్ధూతవిధౌ సహస్రకరతా, పుష్పార్చనేవిష్ణుతా,
గంధే గంధవహాత్మ, తాన్నపచనే బర్హిర్ముఖాధ్యక్షతా,
పాత్రే కాంచనగర్భ, తా స్తిమయిచే, ద్బాలేందుచూడామణే!
శుశ్రూషాం కరవాణి తే పశుపతే! స్వామిన్! త్రిలోకేశ్వర!

29. సర్వాంతర్యామివైన ఓ సాంబశివా! నేను పరమ పవిత్రములైన నీ పాద పద్మములకు ప్రతి నిత్యము పూజార్చనలు చేయుచునే యున్నాను. ప్రతిరోజూ భక్త జనప్రియుడవైన నిన్ను స్మరించుచూ, ధ్యానించుచునే యున్నాను. జరామరణములులేని. నిర్భయమైన స్థితిని ప్రసాదింపుమని దీనుడనై వేడుకొనుచున్నాను. అనేక స్తోత్రములతో నిన్ను ప్రార్థించుచున్నాను. దేవతలచే చిరకాలము నుండీ ప్రార్థింపబడునట్టి లోకగురువైన ఓ సాంబశివా! నీ కటాక్ష వీక్షణమును నాపై ప్రసరించి నా మనస్సునకు సౌఖ్యకరమైన బ్రహ్మజ్ఞానమును ప్రసాదింపుమా!

30. బాలచంద్రుని శిరస్సునందు ధరించిన ఓ సాంబశివా! సమస్త లోకపాలకుడవైన ఓ పశుపతీ! సంసార సాగరమందున్న బద్ధ జీవులను కాపాడి తరింపజేయగల మహాప్రభూ! ఆద్యంతములు లేని సర్వవ్యాపకుడవైన నీకు తగిన ఉపచారములు చేయుటకు నేను అసమర్థుడను గదా! నీకు వస్త్రోపచారము చేయుటకు సహస్రకరుడైన ఆ సూర్యుడే తగినవాడు. పుష్పాదులతో సర్వవ్యాపకుడవైన నీకు అరాధన చేయగల సమర్థుడు శ్రీ మహావిష్ణువే. నిన్ను పరిమళ గంధాదులతో సేవించుటకు వాయుదేవుడే స్తోమతుకలవాడు. నీకు పంచభక్ష్య పరమాన్నములు వండి నైవేద్యము చేయుటకు దేవేంద్రుడే తగినవాడు. నీకు పాత్రోపచారముచేయుటకు బ్రహ్మయే సమర్థుడు. ఈ ఉపచారములు చేయుటకు నేనసమర్థుడనుగాన ఆ సర్వోపచారములకు బదులుగా నేను నా చిత్తమును నీకు సమర్పించితిని. దానిని దయతో స్వీకరించి నన్ను కృతార్థుని చేయుమా!

31.శ్లో॥ నాలంవా, పరమోపకారవ మిదం త్వేకం పశూనాంపతేః
పశ్యన్ కుక్షిగతాన్ చరాచరగణాన్ బాహ్యస్థితాన్ రక్షితుమ్
సర్వామ ర్త్యపలాయనౌషధ మతిజ్వాలాకం భీకరం
నిక్షిప్తం గరళం గళే న గళితం, నోద్గీర్ణమేవ త్వయా॥

32.శ్లో॥ జ్వాలో గ్రస్సకలామరాతిభయదః క్ష్వేళః కథంవా త్వయా
దృష్టః, కించ కరేధృతః, కరతలే, కిం పక్వజంబూఫలమ్
జిహ్వాయాం నిహితశ్చ సిద్ధఘుటికా వా, కంఠదేశే భృతః
కింతే నీలమణి ర్విభూషణ మయం శంభో!మహాత్మన్!వద.

31. బ్రహ్మాది దేవతలకు అధిపతివైన ఓ సాంబశివా! నీయొక్క ఉదరమందును, బాహ్యప్రపంచమందును గల స్థావర జంగమ సమూహములను కాపాడుట కొరకు, సముద్రము మథించగా జ్వాలలతో మహా భయంకరముగా వెలువడిన కాలకూట విషమును జూచి, పారిపోవుచున్న దేవతలను రక్షించి, వారి భయ నివారణకు ఔషధముగా, ఆభీకర హాలాహలమును నీ కంఠమునందు నిలిపి ఉంచుకొనినావు. ఓ పరమేశ్వరా! ఈ విధముగా నీచే చేయబడిన ఈ మహోపకారము ఒకటి అత్యద్భుతమైన నీ ఘనత చాటుటకు చాలదా!

32. సర్వ సుఖ ప్రదాతవైన ఓ మహాత్మా! భయంకరమైన జ్వాలలతో మండుచూ సమస్త దేవతలకు మిక్కిలి భయానకమైన ఆ కాలకూట విషమును నీవెట్లు చూడగలిగితివి? ఇంతేకాక దానిని నీ చేతితో ఉండగా చేసి పట్టుకొనుటకు అది బాగుగా పండి పక్వమున కొచ్చిన నేరేడు పండను కొంటివా? లేక దానిని ఉండగా చేసి నీ నాలిక మీద ఉంచుకొటకు అది ఆరోగ్యమును కలుగజేయు ఔషధపు మాత్రకాదే! నీకంఠము నందా విషమును భూషణముగా ధరించుటకు, అది నీలకంఠమణి అని అను కొంటివాయేమి? చెప్పుమా!

౩౩శ్లో॥ నాలం వాసకృదేవదేవః భవత స్సేవా నతి ర్వా నుతిః.
పూజావాస్మరణం కథాశ్రవణ మస్యాలోకనం మాదృశామ్
స్వామిః న్నస్థిరదేవతానుసరణాయాసేన కిం లభ్యతే
కావా ము క్తిరితఃకుతో? భవతిచేత్కిం ప్రార్థనీయం తదా॥

౩౪. శ్లో॥కిం బ్రూమస్తవ సాహసం పశుపతేః కస్యాస్తి శంభోః భవ
ద్ధైర్యం చేదృశ, మాత్మనస్థ్సితిరియంఃచాన్యైఃకథంలభ్యతే?
భ్రశ్యద్దేవగణం త్రసన్మునిగణం నశ్యత్ప్రపంచం లయం
పశ్యన్నిర్భయ ఏకఏవ విహర త్యానందసాంద్రో భవాన్ ॥

33. సకల భూతాధిపతివైన ఓ ఈశ్వరుడా! నీకు నా హృదయ పూర్వకమైన నమస్కారము చేయుట, నిన్ను వాచికమైన స్తోత్రములతో స్తుతించుట, మానసికమైన నీ నామస్మరణ చేయట, చెవులతో నీ మహిమాన్వితమైన కథామృతమును వినుట, కన్నులతో నీ దివ్యదర్శనము చేసికొనుచుండుట, నిన్ను గురించి నిరంతరము ధ్యానముచేయుట, నాబోటి వానికి చాలవా! కరుణాసముద్రుడవైన నీ యనుగ్రహము సంపాదించి ముక్తినొందుటకు ఈ సాధనలు చాలును. ఈ సాధనలలో దేనివల్లనైనను మోక్షము పొందగలుగుట సాధ్యమగును కదా! అటువంటప్పుడు, మోక్షము నీయలేని యితర దేవతలను నేను శ్రమపడి సేవించుట నిష్ప్రయోజనము. ఆ దేవతలను భజించి కోరదగినదేమీ లేదు. నిన్నే భజించి మోక్షపదమును బొందెదను.

34. త్రిలోకనాథుడవైన ఓ సాంబశివా! నీకు గల ధైర్యసాహసములు ఎవరికి ఉండగలవు? మహాశక్తితో కూడిన నీ నిర్భయత్వము, నిర్వికారత్వము మహదాశ్చర్యకరమైనవి. ఈ విధమైన నీ అద్భుత స్థితిని ఎవరు అవగాహన చేసుకోగలరు? ప్రళయ కాలమందు, తమ తమ పదవుల నుండి జారి నశించుచున్న సకల దేవతాగణములను తిలకించుచూ, భయాందోళనలతో ప్రాణములను విడుచుచున్న మునీంద్రులను, నశించి పోవుచున్న సర్వచరాచర జగస్సృష్టినీ చూచుచూ, నీ ఒక్కడవే మిగిలి నిర్భయుడవై ఆనందముతో విహరించుచుందువు గదా! నీ ధైర్యసాహసములు ఎంత ఆశ్చర్యకరములు?

౮౯.శ్లో॥ యోగక్షేమధురంధరస్య సకలశ్రేయఃప్రదో ద్యోగినో
దృష్టాదృష్టమతోపదేశకృతినో బాహ్యాంతరవ్యాపినః
సర్వజ్ఞస్య దయాకరస్య భవతః కిం వేదితవ్యం మయా
శంభో!త్వం పరమాంతరంగ ఇతిమేచిత్తేస్మరామ్యన్వహమ్ ॥

౮౬.శ్లో॥ భక్తోభక్తిగుణావృతే ముదమృతాపూర్ణే ప్రసన్నే మనః
కుంభేసాంబ!తవాంఘ్రిపల్లవయుగంసంస్థాప్య సంవిత్ఫలమ్
సత్త్వం మంత్ర ముదీరయన్ నిజశరీరాగారశుద్ధిం వహాన్
పుణ్యాహం ప్రకటీకరోమి రుచిరం కల్యాణ మాపాదయన్ ॥

౩౮. సుఖప్రదాతవైన ఓ శంభో ! అందరికీ యోగక్షేమములను, ఐహిక ఆముష్మికములను పొందగల ఉపాయములను ప్రసాదించుచు, సమస్త శుభములను కలిగించుచుండుటయే నీ ఉద్యోగమై యున్నదికదా సర్వసమర్థుడవైన నీవు అంతటా, లోపలా, వెలుపలా వ్యాపించి యున్నావు. సర్వజ్ఞుడవు, దయాసముద్రుడవు అయిన నీ మహాత్మ్యమును నేను తెలిసికొంటిని. ఇక నాకు ఎటువంటి సంశయమూ లేదు. నా అంతఃకరణమందు నువ్వేనాకు పరమ ఆప్తుడివని ఎల్లప్పుడూ తలచుకొనుచున్నాను

౪౦. ఓ సాంబశివా ! నీ భక్తుడనైన నేను నా శరీరమనే యీ గృహమును పరిశుభ్రమైన జలముతో స్నానముచేయించి, శుద్ధుడనైతిని. నీకు సంప్రీతి కలిగించే విధముగా నిర్మలమైన భక్తితో సంతోషాంతరంగుడనై నిశ్చలమైన నామనస్సులో నీ పాదపద్మములను నిలిపి నీ పాదములకు జ్ఞానమనే ఫలమును సమర్పించి, సత్వగుణ ప్రధానమైన పంచాక్షరీ మహామంత్రమును జపించుచు, పుణ్యాహవాచక మనబడు ఈ మహాకార్యమును చేయుచున్నాను. పరమేశ్వరుడవైన నిన్ను ప్రేమతో ధ్యానించుటే కాని నాకు ఏ విధమైన ప్రతిఫలాపేక్ష లేదు.

37.శ్లో॥ అమ్నాయాంబుధి మాదరేణసుమనస్సంఘాస్సముద్యన్మనో
మంథానం దృఢభక్తిరజ్జుసహితం కృత్వామథిత్వా తతః
సోమం కల్పతరుం సుపర్వసురభిం చింతామణిం ధీమతాం
నిత్యానందసుధాం నిరంతరంమాసౌభాగ్య మాతన్వతే ॥

38.శ్లో॥ ప్రాక్పుణ్యాచలమార్గదర్శితసుధామూర్తిః ప్రసన్నశ్శివ
స్సోమ స్సద్గుణ సేవితో మృగధరః పూర్ణ స్తమోమోచకః
చేతఃపుష్కరలక్షితో భవతి చేదానం దపాథోనిధిః
ప్రాగల్భ్యేన విజృంభతే సుమనసాం వృత్తిస్తదా జాయతే॥

37. పూర్వము దేవతల సంఘములు, పండితుల సమూహములు వారి పవిత్ర సకలగుణ సంపత్కరమైన మనస్సును అచంచలమైన భక్తి అనే తాడుతో కట్టబడిన కవ్వముగా జేసి, వేదమనే సముద్రమును ఆసక్తితో మథించగా. వారికి కోరినవన్నీ సంప్రాప్తింపజేయు కల్పవృక్షము, సర్వవాంఛలను తీర్చు కామధేనువు, సర్వైశ్వర్య ప్రదాత అయిన చింతామణి, శాశ్వతానందదాయిని అమృతము, సర్వసౌభాగ్య సమృద్ధదాత లక్ష్మీదేవి సంప్రాప్తములైనవి. అనగా, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి, అమృతము, లక్ష్మి, వీటన్నిటికీ ఆలవాలమైన, సర్వశుభంకరుడైన సాంబశివుని పొందిరని తాత్పర్యము.

38. అమృతమయమైన శరీరముతో తూర్పుదిక్కున నున్న పుణ్యాచలమను ఉదయపుకొండ దారిచూపించగా, అహ్లాదముతో నక్షత్రమండలములచే పరివృతుడై, లేడిని ధరించి పదునారు కళలతో ప్రకాశించుచు, ఎల్లలోకములయందూ వ్యాపించి, చీకటిని పోగొట్టుచున్న ఉదయచంద్రుడు ఆకాశమునందు కనిపించినతోడనే సముద్రముప్పొంగును. ఆ విధముగనే షడూర్మిరహితుడును, శుభంకరుడును, సజ్జనులచే ఆరాధింపబడువాడును, అజ్ఞానాంధకామును పోగొట్టువాడును, సర్వవ్యాపకుడును అయిన సాంబశివుడు మనస్సునందు ఉదయించినంతనే, హృదయముప్పొంగి బ్రహ్మానంద పారవశ్యమగును.

౩౯.శ్లో॥ ధర్మోమే చతురంఘ్రికస్సుచరితః పాపం వినాశం గతం
కామక్రోధమదాదయో విగళితా కాలస్సుఖావిష్కృతః
జ్ఞానానంత్య మహౌషధి స్సుఫలితా కైవల్యనాథే సదా
మాన్యే మానస పుండరీకనగరే రాజావతంసే స్థితి॥

40.శ్లో॥ ధీయంత్రేణ వచోఘటేన కవితా కుల్యోపకుల్యాక్రమై
రానీతైశ్చసదాశివస్య చరితాం భోరాశిదివ్యామృతైః
హృత్కేదారయుతాశ్చ భక్తికలమాస్సాఫల్య మాతన్వతే
దుర్భిక్షా న్మమ సేవకస్య భగవన్‌! విశ్వేశ! భీతిః కుతః!

39. సర్వశ్రేష్ఠుడు, ప్రజారంజకుడు, ధర్మసమ్మతుడు అయిన రాజు పరిపాలించుటకు వచ్చిన యెడల, ఆ దేశములో ధర్మము నాల్గుపాదములా నడుచును. ప్రజలు పాపాలు, నేరాలు, దుష్కార్యాలు ఆచరించరు. జ్ఞానంతో వారివారి కర్తవ్య ధర్మాలను ఆచరిస్తూ జీవితాలను సన్మార్గంలో గడుపుతారు. సకాలంలో జరుగవలసినవన్నీ జరుగుతూవుంటాయి, సస్యశ్యామలంగా పాడిపంటలతో దేశం తులతూగుతూ వుంటుంది. అలాగే చంద్రుణ్ణి శిరమునందు భూషణముగా ధరించిన వాడును, సర్వలోకపూజ్యుడును అయిన సాంబశివుడు నా హృదయశీమలోనున్న శింహాసనమును అధిష్టిస్తే, నాలోని అజ్ఞాన కల్మషాలన్నీ నశించిపోతాయి. జ్ఞానోదయమై, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాదులు నశించి, పాప రహితుడనౌతాను. ఇలా పవిత్రత పొందడంతో జ్ఞానప్రాప్తిని కలుగజేసే సద్గ్రంథాలనే ఔషధులు ఫలించి నాకు ఎల్లప్పుడూ ఆనందం కలుగుతూంటుంది.

40. రాజనీతితో ధర్మాన్ని నాలుగు పాదాలా రాజు నడిపిస్తుంటే ప్రజలు ధర్మనిరతులై జ్ఞానం కలవారై, దేశం సస్యశ్యామలంగా ఉన్నట్లే, చంద్రుని భూషణంగా శిరము నందు ధరించిన వాడు, పరమ పూజ్యుడు, సర్వసమ్మతుడు అయిన శివుడు హృదయశీమలో సుస్థిరుడై ఉంటే, సర్వపాపములు సమసిపోయి, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గాలు అంతమై పోతాయి. జ్ఞాన వికాసం కలిగించే సద్గ్రంథాలు ఔషధులలా ఎల్లప్పుడూ ఫలిస్తూంటాయి.

41.శ్లో॥ పాపోత్పాతవిమోచనాయరుచిరై శ్వర్యాయ మృత్యుంజ
స్తోత్రధ్యాననతిప్రదక్షిణసపర్యాలోకనాకర్ణనే,
జిహ్వాచిత్తశిరోంఘ్రిహస్తనయనశ్రోత్రైరహం ప్రార్థితో
మామాజ్ఞాపయ తన్నిరూపయ ముహుర్మామేవ మామేవ

42.శ్లో॥ గాంభీర్యం పరిఖాపదం, ఘనధృతిః ప్రాకార, ఉద్యద్గు
స్తోమశ్చాప్తబలం, ఘనేంద్రియచయో ద్వారాణి దేహస్థిత
విద్యావస్తుసమృద్ధి రిత్యఖిలసామగ్రీసమేతే సదా
దుర్గాతిప్రియ! దేవ! మామకమనోదుర్గే నివాసం కురు॥

41. ఓ మృత్యుంజయుడా! పాపముల వలన సంభవించు విపత్తులను పోగొట్టుటకొరకు, ఇష్టమైన మహదైశ్వర్యము పొందుటకొరకు నీకు స్తోత్రములుచేయమని, నిన్ను ధ్యానింపుమని, నీకు నమస్కార, ప్రదక్షిణ, పూజా సేవలుచేయమని, నిన్ను దర్శించమని, నీ దివ్య చరితమును ఆకర్ణింపుమని, నా నాలుక, మనసు, శిరము, పాదములు, హస్తములు నేత్రములు, కర్ణములు మొదలలైన అవయములు నన్ను వేడుకొనుచున్నవి. కాని నేను అశక్తుడనై ఆ సేవలు చేయకుంటిని. అందువలన నేను నా జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములతో పై ఉపచారములు నీకు చేయునట్లు అజ్ఞాపించుమా! నీకు సేవలు, ఉపచారములు చేయుచుటలో నాకు మూకత్వము, నిర్లక్ష్యము, నిరపేక్ష లేకుండ జేయుమా! నీకు సేవలు చేయుటతో నా జ్ఞాన కర్మేంద్రియములు నాకు తోడ్పడుచూ, నాకే దోషములు లేకుండ చేయుమని భావము.

42. దుర్గాదేవిమీద ప్రీతిచే పర్వతదుర్గనివాసమందు ఇచ్ఛగల ఓ సదాశివా! రాజుయొక్క కోటయనెడి పర్వత సౌధము గంభీరమైన అగడ్తచుట్టూ కలిగి, రాజభటులచే పరివేష్టింపబడుచూ, ఘనమైన ద్వారములతో లోపల అన్ని అవసర వస్తువులు సమృద్ధిగా నిల్వచేయబడి ఎట్లుండునో, ఆ విధముగనే నామనస్సనే దుర్గము ధైర్యాది గంభీరమైన గుణములు కలిగి, అనేక సాదులక్షణములతో, బలమైనదై, ఇంద్రియములనే ద్వారములతో, వివేక వైరాగ్యాదులతో కూడిన శివజ్ఞాన విద్యతో నిండి, సద్వస్తు సంపూర్ణ భావనతో నున్నది. కావున ఇటువంటి నా మనోదుర్గమందు దుర్గాప్రియుడవైన నీవు నివాసము చేయుమా!

43. పర్వత సంచారివైన ఓ సాంబశివా! ఓ ఆదికిరాతుడా! నా మనస్సనే మహారణ్యమందు కామ, క్రోధ, లోభ, మోహ, మాత్సర్యాది గుణములనే మదించియున్న క్రూర మృగములు ఎప్పుడూ స్వేచ్ఛగా సంచరించుచున్నవి. ఓ దేవదేవా, అరణ్యమన్నను, వేటయన్నను నీకు ఎంతో కుతూహలము కనుక, నా మనస్సునందు ప్రవేశించి, వాటిని వేటాడి, చంపి, అక్కడనే స్థిరముగా నుండుమా! ఇటూనటూ ఎచటికీ పోకుమా! అలా వేటాడుటవలన వినోదము కలిగినవాడవై తప్పక తగినఫలమును పొందగలవు.

44. హస్తమందు లేడి కలవాడు, గజాసురుని పరిమార్చినవాడు వ్యాఘ్రాసురుని సంహరించి వ్యాఘ్రములను ఖండించినవాడు, సమస్త జంతువులను, ప్రాణులను తనయందు లయింప జేసుకొనువాడు పర్వత సీమయందు శయనించి యుండువాడు. స్వచ్ఛమైన కాంతిగల శరీరము కలవాడు, ఐదు ముఖములు కలవాడు అయిన ఈశ్వరుడనే సింహము (సాంబశివుడు) నాకురక్షగా నా మనస్సునందెల్లప్పుడూ నివసించియుండగా నాకెటువంటి భయభ్రాంతులూ కలుగవు.

45. పక్షివంటి ఓ మానసమా! అనేక కొమ్మలు రెమ్మలు, ఫలములు కలచెట్టు మీద, పక్షి తన గూడు నిర్మించుకొని దానిలో సుఖముగా ఎట్లుండునో, అ విధముగనే వేదాంతములైన ఉపనిషత్తులలో చెప్పబడినది, శ్రేష్ఠులైన బ్రాహ్మణులచే ఆశ్రయింపబడినది, శాశ్వత సుఖమును కలిగించునది, సారభూతములైన జ్ఞానవైరాగ్యాది ఫలములచేత సంసార క్లేశములను భేదించునది, దేదీప్యమానమై ప్రకాశించునది అయిన సాంబశివునియొక్క పాదపద్మముల నాశ్రయించి, ఆ పాదద్వయమనే గూటియందువిహరింపుమా!

46. శ్లో॥ ఆకీర్ణే నఖరాజకాంతివిభవై రుద్యత్సుధావైభవై
రాధౌతేఽపి చ పద్మరాగలలితే హంసవ్రజై రాశ్రితే
నిత్యం భక్తివధూగణైశ్చ రహసి స్వేచ్ఛావిహారం కురు
స్థిత్వా మానసరాజహంస! గిరిజానాథాంఘ్రిసౌధాంతరే॥

47. శ్లో॥ శంభుధ్యానవసంతసంగిని హృదారామేఽఘజీర్ణచ్ఛదా
స్రస్తాః భక్తిలతాచ్ఛటావిలసితాః పుణ్యప్రవాళశ్రితాః
దీప్యంతే గుణకోరకా జపవచఃపుష్పాణి సద్వాసనా
జ్ఞానానందసుధామరందలహరీసంవిత్ఫలాభ్యున్నతిః

46. ఓ రాజహంసమా! పద్మములతో శోభిల్లు నిర్మల ప్రశాంత మాన సరోవరములో ఏకాంతముగా ఆనంద మనుభవించుచు విహరించు రాజహంసలవలె, తెల్లని గోళ్ళకాంతులచే శోభిల్లుచూ, వర్ధమాన చంద్రుని కిరణ కాంతులచే ధవళముగా కెంపుల వలె మనోహరముగానున్న, మంత్రధ్యాన నిష్టాగరిష్ఠులగు పరమహంస పరివ్రాజకులైన మహాజ్ఞానులు ఎల్లప్పుడూ ఆశ్రయించియుండు ఆ సదాశివుని పాద పద్మములను హృదయపూర్వక శ్రద్ధా భక్తులతో శేవించుచూ, శివానందపరురాల వగుమా!

47. వసంత ఋతువు వచ్చిన తోడనే, వనములలోని చెట్లనుండి పండు టాకులు రాలిపోయి మనోహరమైన కొత్త చిగురుటాకులు, పూలమొగ్గలు బయలుదేరును. ఆ మొగ్గలు వికసించి, పరిమెళములను నలుదెసలా వెదజిమ్మే శోభాయమానమైన పుష్పములుగా మారును. అలాటి పుష్ప ములలోని పుష్పరసములను (తేనెను) తుమ్మెదలు గ్రహించి ఆనందిం చును. ఆ ప్రకారమే సర్వేశ్వరుడైన సదాశివుని ధ్యానములో నిమగ్నుడైన వాని మనస్సునుండి సర్వపాప పంకిలములు జారిపోయి, (ఎండుటాకుల వలె), పుణ్యములు (చిగురుటాకులు), సద్గుణములు (మొగ్గలు) జపావా క్కులు (పుష్పములు) మనస్సునావరించును. సాధువర్తనుడై, భక్తి అధిక ముకాగా, చిత్తశుద్ధికలిగి, జ్ఞానానందామృతమనే ఫలోన్నతిని పొంది బ్రహ్మవిదుడగును. అంటే, సాంబశివుని హృదయస్థలిలో సేవించువానికి శివ్వక ఆత్మజ్ఞానము సంప్రాప్తించునని భావము

48. శ్లో॥ నిత్యానందరసాలయం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛం సద్ద్విజసేవితం కలుషహృత్సద్వాసనావిష్కృతమ్
శంభుధ్యాన సరోవరం వ్రజ మనోహంసావతంస! స్థిరం
కింక్షుద్రాశ్రయపల్వల భ్రమణ సంజాతశ్రమం ప్రాప్స్యసి॥

49. శ్లో॥ ఆనందామృత పూరితా హరపదాంభోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్న ముపేత్య భక్తిలతికా శాఖోపశాఖాన్వితా
ఉచ్చైర్మానసకాయమాన పటలీ మాక్రమ్య నిష్కల్మషా
నిత్యాభీష్టఫలప్రదా భవతు మే సత్కర్మ సంవర్ధితా

48. మనస్సనే ఓ హంసరాజమా! సదాశివ ధ్యాన సరోవరమునందు స్థిరముగ నుండుమా! అట్టి సరోవరమునందు నిత్యానందమై వెలయు ఉదకముండును. దేవతలయొక్కయు, పరమహంసలగు మునీంద్రుల యొక్కయు హృదయ కమలములుండును. మునీశ్వరులును, పవిత్రులగు బ్రహ్మణులును నిరతము నిర్మల, నిశ్చల ధ్యానముచే కడిగివేయబడిన పాపములుగలవారై, సత్సంకల్పములతో సత్కర్మలయందు ఆసక్తి కలిగి యుందురు. కనుక ఓ మానస హంసరాజమా! ఎల్లప్పుడూ సాంబశివ ధ్యానమనెడి శ్రేష్ఠమైన అనుష్ఠానమందుండుము. అట్లుగాక, అల్పులైన క్షుద్ర దేవతలను ఆశ్రయించి ఆరాధించిన ఏమి ఫలము కలుగును?

49. శివభక్తి అనే లత, ప్రేమయనెడి జలముతో నిరంతరము అభిషేకము చేయబడిన శివపాదకమలముల నుండి బయలుదేరి వృద్ధిపొందుచూ, స్థిరచిత్తమనే ఆశ్రయము (ప్రాకుటకు దారువు)ను పొంది, పెద్ద పెద్ద కొమ్మలతోను, చిన్న చిన్న రెమ్మలతోనూ పూర్వజన్మార్జిత పుణ్య కర్మ ఫలితమువలన వృద్ధిజెందును. అలా వృద్ధిపొందిన భక్తిలత శాశ్వతమైన వాంఛార్థ ఫలమును, అనగా శివానందమనెడి మోక్షమును ప్రసాదించును.

౫౦.శ్లో॥ సంధ్యారంభవిజృంభితం శ్రుతిశిరస్థానాంతరాధిష్ఠితం
స ప్రేమ భ్రమరాభిరామ మసకృత్సద్వాసనా శోభితమ్
భోగీంద్రాభరణం సమస్తసుమనః పూజ్యంగుణావిష్కృతం
సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్॥

౫1.శ్లో భృంగీచ్ఛానటనోత్కటః కరిమద గ్రాహిస్ఫురన్మాధవా
హ్లాదో నాదయుతో మహాసితవపుః పంచేషుణాచాదృతః
సత్పక్షస్సుమనో (2)వనేషుసపునస్సాక్షాన్మదీయే మనో
రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశై-లవాసీ విభుః॥

50. అంబికయగు పార్వతితో కూడియున్నవాడును. (శివాలింగితం) సాయం సమయమందు శివుని తాండవము విజృంభించి యుండుటచే భక్తులను అనుగ్రహించు పుష్పవికాసము కలిగి యున్నవాడును, ప్రేమ మయురాలైన భ్రమరాంబతో కూడియున్నవాడునూ, శిరము మీదను, చెవుల యందును మల్లెపూలుధరించి, భక్తితో, తుమ్మెదలు ఝూంకారము చేయుచూ విహరించుచుండ, తనచుట్టూ పదే పదే సత్పురుష భావనచే జనించు సువాసనా శోభితుండును, ప్రకాశించునట్టి వాసుకి యను సర్ప రాజును ఆభరణముగా గలవాడును, సకల దేవతలకూ పూజ్యుడైన వాడును, సత్త్వగుణ ప్రకాశకుడును అయిన శ్రీ గిరి మల్లికార్జున మహా శివ లింగమును సేవించుచున్నాను.

51. తన భక్తుడైన భృంగియను ప్రమథుని నాట్యమందు ఉత్కంఠ కలిగినవాడును, గజాసురుని మదమును అణచినవాడును, జగన్మోహినీ రూపధరుడైన విష్ణుదేవునిపట్ల సంతోషము గలవాడును, గొప్పదైన తెల్ల (మహాసిత) శరీరము గలవాడును, మన్మథుని యొక్క పుష్ప బాణములందు నిర్లిప్తుడైనవాడును, దేవతలను ఆదరించి రక్షించువాడును అయిన చక్షురాది ఇంద్రియగోచరమైన శ్రీశైలక్షేత్రమున వెలసియున్న ఆ శ్రీ భ్రమరాంబికా మనోహరుడైన సాంబశివుడు నామనస్సునందు సాక్షాత్కరించి విహరించు గాక.

52. శ్లో॥ కారుణ్యామృత వర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం
విద్యాసస్య ఫలోదయాయ సుమనస్సంసేవ్యమిచ్ఛాకృతిమ్
నృత్యద్భక్తమయూర మద్రినిలయం చంచజ్జటామండలం
శంభోః వాంఛతి నీలకంధర!సదా త్వాంమే మనశ్చాతకః॥

53. శ్లో॥ ఆకాశేన శిఖీ సమస్తఫణినాం నేత్రా కలాపీనతా
నుగ్రాహీ ప్రణవోపదేశనినదైః కేకీతియో గీయతే
శ్యామాం శైలసముద్భవాం ఘన రుచిం దృష్ట్వా నటంతం ముదా
వేదాంతోపవనే విహారరసికం తం నీలకంఠం భజే॥

52. ఉదకమయమైన నల్లని మేఘమును బోలిన కంఠముగల ఓ నీల కంధరా! శంభో! శుభంకరుడా! నీవు ఎల్లప్పుడూ నీ కరుణారసామృతమును భక్తులపై కురిపించు వాడవు. గ్రీష్మ ఋతువు యొక్క తాపములను పోలిన భక్తజనుల విపత్తులను పోగొట్టుట యందు ఆకాంక్ష కలవాడవు, అనేక అద్భుతమైన ఆకారములు గలవాడవు. సస్యశ్యామలాదులకై ఎదురుచూచు కర్షకులవంటి దేవతల చేతను, సద్భక్తులచేతను సేవింపబడు వాడవు. నీల మేఘములయందు ప్రీతిగలిగి, హర్షముతో నాట్యము చేయుచుండు నెమళ్ళతో నున్న కైలాస పర్వత నివాసివై మెరుపులవంటి జడలు ధరించియున్న నీదివ్య స్వరూపమును, మెడపైకెత్తి మేఘములయందలి వర్షబిందువులను పానముచేయు చాతక పక్షిని బోలు నా మనస్సు దర్శింపగోరు చున్నది.

53. నెమలికి తలమీదనున్న శిఖవలె ఆకాశమును శిఖగా కలిగిన వాడును, నెమలికి పింఛమువలె, సర్పములకెల్ల ప్రభువైన వాసుకియను సర్పరాజును భూషణముగా చేసుకొని కలాపియైనవాడును, వంగి తనకు మ్రొక్కు నమ్రులను అనుగ్రహించు వాడును, నెమలిచే చేయబడు కేంకార ధ్వని వంటి ఓంకార ధ్వనితో కూడిన ప్రణవస్వరూపుడును, హిమవత్ పర్వతపుత్రియైన పార్వతినిగాంచి హర్షముతో తాండవ నృత్యమును జేయువాడును, వేదాంత క్రీడా వనమునందు విహరించు వాడును అయిన ఆ నీలకంఠుడగు సాంబశివుని నేను సంతోషముతో సేవించు చున్నాను.

54 శ్లో॥ సంధ్యా ఘర్మదినాత్యయో హరికరాఘాతప్రభూతానక
ధ్వానో వారిదగర్జితం దివిషదాం దృష్టిచ్ఛటా చంచలా
భక్తానాం పరితోషబాష్పవితతి ర్వృష్టిర్మయూరీ శివా
యస్మి న్నుజ్జ్వలతాండవం విజయతే తం నీలకంఠంభజే।

55 శ్లో॥ ఆద్యాయామితతేజసే శ్రుతిపదై ర్వేద్యాయ సాధ్యాయతే
విద్యానంద మహాత్మనే త్రిజగత్సంరక్షణోద్యోగినే
ధ్యేయా యాఖిల యోగిభిస్సురగణై ర్గేయాయ మాయావినే
సమ్యక్తాండవ సంభ్రమాయ జటినే సేయంనతిశ్శంభవే॥

౮4. గ్రీష్మ ఋతువు నందు ఆకాశము మేఘములతో, ఉరుముల ధ్వనులతో, మెరుపుతీగల ప్రకాశముతో నిండినదై వర్షము కురియు సమయమున ఆడునెమలితో కూడి మొగనెమలి మిక్కిలిసంతోషముతో నాట్యము చేయు విధముగా, సంధ్యాసమయమందు విష్ణువు యొక్క ఆనకమనెడి వాయిద్య మను ఉరుముతోను, ఆనంద పరవశులై యున్న దేవతా సమూహములను మెరుపులతోను, భక్తులయొక్క ఆనందా శ్రువులను వర్షముతోను వున్న సమయమందు, మయూరీ మయూర నాట్యమువలె, పార్వతీ దేవితో గూడి ఉజ్వల మహానంద తాండవము సల్పు సాంబ శివుని భక్తితో సేవించుచున్నాను.

౮౫. జగ సృష్టికి పూర్వమే వున్నటువంటి వాడును, మహాతేజస్వరూపుడును, వేదాంతమహా వాక్యములచే తెలియ శక్యమగు వాడును, భక్తానుగ్రహుడను సచ్చిదానంద స్వరూపుడును, ముల్లోకరక్షకుడును, యోగీశ్వరులకు ధ్యానయోగ్యుడును, దేవతా సంఘములచే స్తుతింపబడువాడును, మాయాశక్తియుక్తుడైన వాడును, ప్రదోషకాలతాండవమాడుట యందిచ్ఛ కలవాడును, జటాజూటధరుడును అయిన సుఖకరుడగు సాంబశివునకు నమస్కారము.

56. శ్లో॥ నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయనీశ్రేయసే
సత్యాయాదికుటుంబినే మునిమనఃప్రత్యక్షచిన్మూర్తయే
మాయాసృష్టజగత్త్రయాయ సకలామ్నాయాంతసంచారిణే
సాయంతాండవసంభ్రమాయ జటినే సేయంనతిశ్శంభవే॥

57. శ్లో॥ నిత్యం స్వోదరపోషణాయ సకలా నుద్దిశ్య విత్తాశయా
వ్యర్థం పర్యటనం కరోమి భవత స్సేవాం నజానే విభో:
యజ్జన్మాంతర పుణ్యపాక బలత స్త్వంశర్వ! సర్వాంతర
స్తిష్ఠస్యేవ్య హితేనవా పశుపతే! తేరక్షణీయోఽస్మ్యహమ్॥

58 శ్లో॥ ఏకో వారిజబాంధవః క్షితినభోవ్యాప్తం తమోమండలం
భిత్వాలోచనగోచరోపి భవతి, త్వం కోటి సూర్యప్రభః
వేద్యం కిం నభవస్యహో, ఘనతరం కీదృగ్భవేన్మత్తమః
తత్సర్వం వ్యపనీయ మే పశుపతే! సాక్షాత్ప్రసన్నోభవః॥

66. నిత్యుడు, త్రిగుణస్వరూపుడు, త్రిపురములనబడు స్థూల సూక్ష్మ, కారణ శరీరములను జయించినవాడు, కాత్యాయిని (పార్వతి) యొక్క తపః ఫలస్వరూపుడు, త్రికాలములకు అతీతుడైన సత్యస్వరూపుడు, సృష్టికి ప్రథమ సంసారియు, మునీశ్వర మానస గోచరమగు చిత్స్వరూపుడు, మాయచే సృష్టింపబడిన లోకములను కలిగి వేదాంత వనవీధులందు సంచరించువాడు, సాయంకాల తాండవనృత్యమందు అభిలాష కలవాడు, లోకమునకు శ్రేయస్సు కలుగజేయువాడు, అయిన సాంబశివునకు నమస్కరించుచున్నాను.

67. నేను ఎల్లప్పుడూ ఉదర పోషణార్థమై ధన సంపాదన కొరకు అందరినీ ఆశ్రయించుచు, వ్యర్థముగ పర్యటించుచున్నాను. కాని సర్వవ్యాపకుడవైన ఓ విభూ! నిన్ను సేవించుటయందు గుర్తెరుగకున్నాను. సర్వేశ్వరుడవైన ఓ ఈశ్వరా! నా యొక్క జన్మాంతర పుణ్యపాక వశముచే నీవు నా దేహమందు సూక్ష్మరూపుడవై జీవునిగా భాసించుచున్నావు గదా! ఆ హేతువు వలన నేనునీచేత ఉపేక్షింపబడజాలను. నీవు నన్నురక్షింప తగిన వాడవైతివి

68. ఓ పశుపతీ పద్మబాంధవుడైన సూర్యుడు ఏకైక స్వరూపుడయ్యూ భూమియందును, అంతరిక్షమండలమందునూ వ్యాప్తమై యున్న చీకటినంతటినీ పోగోట్టుచున్నాడే! అటువండిది, ఓ సర్వేశ్వరా! కోటి సూర్యకాంతుల తేజస్సు కలిగియుండియు, మాకు ఏల ప్రత్యక్షుడవుకాకుంటివో ! ఎంత విచిత్రము? అందుచేత దయతో ప్రత్యక్షుడవై నా అజ్ఞానాంధకారమును నశింపజేయుమూ!

59. శ్లో॥ హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోరస్తథా,
చేతో వాంఛతి మామకం పశుపతే! చిన్మార్గమృగ్యం విభో!
గౌరీనాథ! భవత్పదాబ్జయుగళం కైవల్య సౌఖ్యప్రదమ్॥

60 శ్లో॥ రోధస్తోయహృతః శ్రమేణ పథికశ్ఛాయాంతరోర్వృష్టితః
భీతస్స్వస్థగృహం, గృహస్థమతిథి, ర్దీనః ప్రభుం ధార్మికమ్
దీపం సంతమసాకులశ్చ, శిఖినం శీతావృత, స్త్వం తథా
చేతస్సర్వభయాపహం వ్రజ సుఖం శంభోః పదాంభోరుహమ్॥

59. సకల భూతాధిపతివైన ఓ గౌరీనాథా! హంస పద్మవనమందు విహరింపకోరునట్లును, చాతకపక్షినల్లని మేఘమునుండి వర్షపునీటిని ఆశించునట్లును చక్రవాకము సూర్యుని, చకోరపక్షి చంద్రుని అభిలషించునట్లును నా యొక్క చిత్తము, ఉపనిషత్యాది సర్వోత్కృష్ట మార్గముల ద్వారా తెలియబడు ఏ కైవల్య సుఖముకలదో దానిని నీపాద పద్మముల యందు పొందగోరుచున్నది.

60. ఓ మానసమా! జలప్రవాహములో బడి కొట్టుకొని పోవువాడు గట్టును, (ఒడ్డును), ఎండలో పడి నడచిపోవువాడు చెట్టు నీడను, వర్షపాతము వలన తడిసిపోవువాడు స్వస్థమైన ఇంటిని, స్వగృహమును వీడి సంచరించు అతిధి తన్నాదరించు గృహస్థుని, దరిద్రుడు దాతను, అంధకారములో, కన్నుగానకయున్నవాడు దీపమును, చలిచేత వణకుచున్నవాడు అగ్నిని ఏప్రకారము పొందెదరో. ఆ విధముగనే, సమస్తక్లేశములను పోగొట్టగలిగి సుఖమును కలుగుజేయు ఆ సాంబశివుని యొక్క పాదపద్మముల నాశ్రయింపుమా!

61 శ్లో॥ అంకోలం నిజబీజసంతతి, రయస్కాంతోపలం సూచికా,
సాధ్వీనైజవిభుం, లతా క్షితిరుహం, సింధు స్సరిద్వల్లభమ్
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా, సాభక్తిరిత్యుచ్యతే॥

62 శ్లో॥ఆనందాశ్రుభిరాతనోతిపులకం, నైర్మల్యతశ్ఛాదనం
వాచాశంఖముఖేస్థితైశ్చ,జఠరాపూర్తిం చరిత్రామృతైః
రుద్రాక్షై ర్భసితేన దేవః వపుషో రక్షాం, భవద్భావనా
పర్యంకే వినివేశ్యభక్తి జననీ భక్తార్భకం రక్షతి॥

61. నేలపై రాలిపోయిన ఊడుగ విత్తనములు తిరిగి ఆ చెట్టుని అంటుకొని ఉండునట్లును, సూది అయస్కాంతము దరికి పోయి దాని నంటుకొనునటులను, పతివ్రత తన భర్తను, తీగ వృక్షమును, నది సముద్రమును పొందునట్లునూ, చిత్తము ఎల్లప్పుడూ, ఆ పశుపతియైన సదా శివుని పాదయుగళమును పొంది అందు స్థిరముగానుండుటయే అచంచలమైన భక్తియని చెప్పబడుచున్నది.

62. ఓ మహాదేవా! నీ మీద భక్తి ఆనే తల్లి తన భక్తుడైన బిడ్డను ఆనందాశ్రువులచే ఆనంద పరచుచు, గగుర్పాటు గల వానినిగా చేయుచున్నది, అన్ని పరిస్థితులలోను సమానమైన నిర్మలత్వమనెడి వస్త్రమును కప్పి, శంఖములో పాలు త్రాగించునట్లు వేదాంత శాస్త్రములలోని పరతత్వ మకరందమును మనసున కెక్కించి, రుద్రాక్షమాలలను ధరింపచేసి, మంత్ర భస్మము చేతను, విభూతుల చేతను రక్షణ చేయుచూ భక్తియనెడి పాన్పుపై పరుండజేసి ఎటువంటి ఆపదలూ రాకుండగా కాపాడుచున్నది.

63 శ్లో॥ మార్గావర్తితపాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే
గండూషాంబు నిషేచనం పురరిపోర్దివ్యాభిషేకాయతే
కించిద్భక్షిత మాంస శేషకబళం నవ్యోపహారాయతే,
భక్తిః కిం న కరోత్యహో! వనచరో భక్తావతంసాయతే॥

64 శ్లో॥ వక్షస్తాడనమంతకస్య, కఠినాపస్మార సంమర్దనం,
భూభృత్పర్యటనం, నమస్సురశిరఃకోటీర సంఘర్షణమ్
కర్మేదం మృదులస్య తావకపద ద్వంద్వస్య గౌరీపతే!
మచ్చేతో మణి పాదుకా విహరణం శంభో! సదాంగీకురు॥

63. నీ యందుగల అపారమైన భక్తి తిన్నడనుబోయవానిచే, అనేక మార్గములలో తాను నడచేటువంటి తన పాదరక్షను నీ కనుబొమల మధ్యస్థానమందు వుంచునట్లు చేసినది. నీ దేహమునకు (శివలింగమునకు) తన పుక్కిటి నీళ్ళచే (యెంగిలి నీళ్ళతో) అభిషేకము చేయించినది. క్రౌంచము తినగా మిగిలిన యెంగిలి మాంసమును నీకు నైవేద్యము చేయించినది. వనచరుడైన ఆబోయవాడు భక్త శ్రేష్ఠునివలె అర్పించిన అవస్నిదయతో నీవు స్వీకరించితివి. ఆహా! ఎంత చిత్రము? భక్తికి సాధ్యముకానిదేముండును?

64. సుఖప్రదాతవైన ఓ పసుపతీ! ఓ సాంబశివా! భక్తులను మరణ భయమునుండి. రక్షించుటకు నీవు యమధర్మరాజుయొక్క కఠినమైన వక్షస్థలమును తన్నుట వల్లను, నిన్ను సేవించు జిజ్ఞాసులను తరింప జేయుటకు వారి అజ్ఞాన అహంకారములను నీపాద పద్మములతో త్రొక్కి వేయుట వలనను, కైలాస పర్వత శిలలయందు నీవు చేయునృత్య విహారాదులచేతను, నీకుసర్వదా ప్రణమిల్లుచుండెడి దేవతల యొక్క మణిమయ సువర్ణకిరీటములు తగులుట వల్లను, అతిమృదువైన నీ పాదములకు బాధ కలగకుండుటకుగాను, నా మనస్సనెడి మణిమయ పాదుకలను ధరించి విహరించుటకు అంగీకరింపుమా!

65 శ్లో॥ వక్షస్తాడనశంకయా విచలితో వైవస్వతో,నిర్జరాః
కోటీరోజ్జ్వల రత్న దీపకలికా నీరాజనం కుర్వతే
దృష్ట్వా ముక్తి వధూ స్తనోతినిభృతా శ్లేషం భవానీపతేః
యచ్చేత స్తవ పాదపద్మభజనం తస్యేహ కిందుర్లభమ్॥

66 శ్లో॥ క్రీడార్థం సృజసి ప్రపంచమఖిలం క్రీడామృగాస్తే జనాః
యత్కర్మాచరితం మయాచ భవతః ప్రీత్యైభవత్యేవ తత్
శంభోః స్వస్య కుతూహలస్య కరణం మచ్చేష్టితం నిశ్చితం
తస్మాన్మామకరక్షణం పశుపతేః కర్తవ్య మేవత్వయా॥

67 శ్లో॥ బహువిధ పరితోష బాష్పపూర
స్ఫుటపులకాంకితచారు భోగభూమిమ్
చిరపదఫల కాంక్షి సేవ్యమానాం
పరమ సదాశివ భావనాం ప్రపద్యే॥

65. ఉమాపతివైన ఓ శంకరుడా! ఎవనిచిత్తము నీయొక్క పాదపద్మము లందు అచంచలమైన భక్తి కలిగి యుండునో, ఆ మహనీయుని జూచి, ఆభక్తుడునూ తన రొమ్మును శివునివలె ఎక్కడ తన్నునో యని శంకాస్పదుడై యమధర్మరాజు పారిపోవు చున్నాడు, దేవతలు అటువంటి నీ భక్త శేఖరునకు శతకోటి దీపములవలె ప్రకాసించుచుండు తమతమ రత్న కిరీటపు కాంతి పుంజములతో హారతుల నొసగుచు నివాళులర్పించు చున్నారు. ఆ మహనీయుని ముక్తికాంత ఆలింగనము చేసికొనుచున్నది. కనుక ఆ శివభక్తవరేణ్యునికి అలభ్యమైనది ఈ లోకమందేమున్నది?

66. సర్వభూతేశ్వరుడవైన ఓ శంభూ! ఈ ప్రపంచ మంతటినీ నీ విలాసము కొరకే నీవు సృష్టించు చున్నావు, కనుక ఇందలి జనులందరూ నీయొక్క క్రీడార్థము సృజింపబడిన మృగములే అగుచున్నారు. అందువలన నాచే చేయబడే కర్మములన్నీ నీ వినోదము కొరకే కదా! నీయొక్క సంతోషమే వాటి ప్రయోజనమై యున్నది. కనుక, నేనేమి చేసిననూ, నన్ను కరుణించి సంరక్షింపవలసినవాడవు నీవే అయి వున్నావు సుమా!

67. అనేక విధములైన ఆనంద బాష్పములతో, పరవశమైన, ఒడలెరుగని గగుర్పాటు కలిగించు సాంబశివునిమీది భక్తికి, అధికముగా కాంక్షించు ఫలము, శ్రేష్ఠమైన, శ్రేయోదాయకమైన ఆ పరమశివుని యొక్క శరణ్యమే. కనుక అజ్ఞాన నివృత్తి కలుగుటకు మోక్షపదమును పొందుటకు, నిరంతర ధ్యానానుష్ఠానములతో కూడిన సాధన చేయుచు, పరమ పావనుడైన ఆ సదాశివుని సతతము ఆరాధించు చున్నాను.

౬౮ శ్లో॥ అమితముదమృతం ముహుర్దుహంతం
విమల భవత్పద గోష్ఠ మావసంతమ్
సదయ। పశుపతే। సుపుణ్యపాకాం
మమ పరిపాలయ భక్తిధేను మేకామ్॥

౬౯ శ్లో॥ జడతా పశుతా కళంకితా
కుటిలచరత్వం చ నాస్తిమయి
దేవ అస్తి యది రాజమౌళే!
భవదా భరణస్య నాస్తికిం పాత్రమ్॥

70 శో॥ అరహసి రహసి స్వతంత్రబుద్ధ్యా
వరవసితుం సులభః ప్రసన్నమూర్తిః
అగణిత ఫలదాయకః ప్రభు ర్మే
జగదధికో హృది రాజశేఖరోఽస్తి॥

68. దయామయుడవైన ఓ పసుపతీ! ఆనందమనే అమృతతుల్యము వంటి పాలను అమితముగా మాటిమటికీ ఇచ్చేదీ, నిర్మలమైన నీ పాద పద్మములను ఆశ్రయించుకొని వుండేది, నేను చేసుకొనిన పూర్వజన్మ పుణ్యపరిపాకవశమున నాకు కలిగినదీ అయిన నాయొక్క నిర్మలమైన భక్తి అనే గోవును ఒక్కదానినీ సంరక్షించుమా! అనగా నా ఈ ఒక్క కోరికను అనుగ్రహించి నాకు నీ మీద కలిగిన భక్తి నన్ను వీడకుండా చూడుమా!

69. చంద్రవంకను శిరమున ధరించిన మహాశివా! జడత్వము, పశు త్వము, కళంకత్వము, కుటిలత్వము కలిగియున్న చంద్రుని ఆభర ణముగా శిరమునందు ధరించి యున్నావు. అటువంటి దోషములున్న వాడు నీకు ఆభరణమగుటకు పాత్రుడై యుండునా? కాని నాలో అటు వంటి దోషస్వభావము లేవీ లేవే! కాబట్టి నేను నీకు భూషణమై నీ ప్రేమకు పాత్రుడనూ, అర్హుడనూ అవనా యేమి?

70. అసంఖ్యాకమైన మనోవాంఛల నన్నింటినీ తీర్చు ప్రసన్నమూర్తి, జగత్తున కెల్ల అత్యాధికుడు, చంద్రుని శిరమున ధరించు రాజశేఖరుడు అయిన ఈశ్వరుడు నా హృదయమందున్నాడు. బహిః ప్రదేశమునగాని, అంతరంగమందుగాని, స్వతంత్రమైన పరిజ్ఞానముచే గాని సేవించుటకు సులభసాధ్యుడు. అట్టి ఈశ్వరుని నాయొక్క హృదయమున ఆరాధింతును.

71. శ్లో॥ఆరూఢభక్తిగుణకుంచిత భావచాప
యుక్తై శ్శివస్మరణబాణగణై రమోఘైః
నిర్జిత్య కిల్బిషరిపూ న్విజయీ సుధీంద్ర
స్సానంద మావహతి సుస్థిర రాజ్యలక్ష్మీమ్।

72 శ్లో॥జ్ఞానాంజనేన సమవేక్ష్య,తమఃప్రదేశం
భిత్త్వా, మహాబలిభి రీశ్వరనామమంత్రైః
దివ్యాశ్రితం భుజగభూషణ ముద్వహంతి,
యే పాదపద్మ మిహతే శివః తే కృతార్థాః॥

73 శ్లో॥ భూదారతా ముదవహ ద్యదపేక్షయా శ్రీ
భూదార ఏవ కి మత స్సుమతేః లభస్వ
కేదార మాకలితముక్తి మహౌషధీనాం,
పాదారవింద భజనం పరమేశ్వరస్య॥

71. లోకమునందు తన విలు విద్యాకౌశలముచేత, పరాక్రమము చేత, రాజు శత్రువులందరినీ జయించి వారి రాజ్యలక్ష్మిని ఎట్లు పొందుచున్నాడో ఆ విధముగనే భక్తుడైనవాడు తన మనస్సును వశపరచుకొని నిరంతరము శివస్మరణ ధ్యానములచేత తన పాప పంకిలములనన్నింటినీ పోగొట్టుకొని, విజయానందానుభూతితో సాయుజ్య పదమును పొందుచున్నాడు.

72. ధనాంజనమను ఒకవిధమైన కాటుకను నేత్రములకు పెట్టుకొని, భూమిలో ధనము పాతిపెట్టిన స్థలమును తెలిసికొని, ఆనిక్షేపమును రక్షించు దేవతలను, బలులచేతను, పూజలచేతను ప్రసన్నులను చేసి, ఆ ధనమును త్రవ్వి తీసుకొను మానవుడు ఎటుల ఆనందించునో, అట్లే ఓ సాంబశివా! భక్తులున్నూ అనేక ఉపాయములచే నిన్ను ధ్యానించుచూ, నీ పవిత్ర నామమును స్మరించుచు, నీ పాదపద్మములను సేవించుచు, నీకు ప్రసన్నత కలిగించి, అన్యులకు లభ్యముకాని, ఆ పరమార్థానందమును అనుభవించుచున్నారు.

73. ఓ సద్బుద్ధిగలవాడా! పరమ శివుని పాదారవింద దర్శనాపేక్ష కలిగినవాడై శ్రీదేవి, భూదేవి భార్యలుగాగల శ్రీ మహావిష్ణువే ఆ సాంబ శివుని పాదపద్మములు సేవించుటకొరకు వరాహ రూపమెత్తి భూమిపై అవతరించెను. అటువంటప్పుడు, నీవును ఆసాంబ శివుని సేవించుచూ కృతార్థుడవగుమా!

74 శ్లో॥ ఆశాపాశక్లేశదుర్వాసనాది
భేధోద్యుక్తై ర్దివ్యగంధై రమందైః
ఆశాశాటీకస్య పాదారవిందం
చేతఃపేటీం వాసితాం మే తనోతి॥

75 శ్లో॥ కల్యాణినం సరసచిత్రగతిం సవేగం
సర్వేంగితజ్ఞ మనఘం ధ్రువలక్షణాఢ్యమ్
చేతస్తురంగ మధిరుహ్యా చర స్మరారేః
నేతః స్సమస్త జగతాం వృషభాధి రూఢః

76 శ్లో॥ భక్తి ర్మహేశపద పుష్కర మావసంతీ
కాదంబినీవ కురుతే పరితోషవర్షమ్
సంపూరితో భవతి యస్య మనస్తటాక
స్త జ్జన్మనస్య మఖిలం సఫలం చ నాన్యత్॥

74 దిక్కులే అంబరములుగా గలిగిన సాంబశివునియొక్క పాదార విందములు నా హృదయ పేటిక యందున్నచో ఆశాపాశములవంటి దుర్వాసనా దుర్గుణముల నన్నింటినీ పోగొట్టి భక్తి, జ్ఞాన, వైరాగ్యములనెడి దివ్యములైన పరిమళములు వెదజల్లునట్లు చేయును. కనుక, నా హృదయ మందు ఆ దిగంబరుడైన సదాశివుని పాదార విందములను ఎల్లప్పుడూ వుంచుకొని సేవించెదనుగాక!

75. ఓ వృషభవాహనుడా! సమస్తలోకములకు ప్రభువైన సాంబశివా మన్మధుని సంహరించువాడా! ఎటువంటి దోషములు లేక, సమస్త శుభలక్షణములతో కళ్యాణగుణములు కలిగి, అనుకూలమైన సగమనములతో డను, వేగముతోడను కూడియున్న నా మనస్సనే గుఱ్ఱమును అధిరోహించి ఎల్లప్పుడూ సంచరింపుమా!

76. సాంబశివుని పాదపద్మములయందుండు సాధకుని భక్తి ఆకాశమందంతటనూ వ్యాపించియున్న మేఘ మాలికవలె ఆనంద వర్షము కురిపించును. ఆపుడు ఆభక్తుని మనస్సనెడి తటాకము భక్తిచేత సంపూర్ణముగా నిండింపబడినదై, చెరువు కిందనుండు పైరులన్నీ సఫలమై పండునట్లు ఆతనియొక్క భక్తి ఫలవంతమై శివసాయుజ్యమును బొంది ఆతని జన్మ కృతార్థమగును. ఇతర జన్మలట్లు సఫలము కానేరవు.

77 శ్లో॥ బుద్ధిఃస్థిరా భవతు మీశ్వర పాదపద్మ
సక్తా వధూః విరహిణీవ సదా స్మరంతీ।
సద్భావనా స్మరణ దర్శన కీర్తనాది
సమ్మోహితేవ శివ మంత్రజపేనవింతే॥

78 శ్లో॥ సదుపచారవిధి ష్వనుబోధితాం
సవినయాం సుహృదం సముపాశ్రితమ్
మమ సముద్ధర బుద్ధి మిమాం ప్రభోః
వరగుణేన నవోఢవధూమివ॥

79 శ్లో॥ నిత్యం యోగిమవస్సరోజదళ సంచారక్షమ స్త్వత్క్రమ
శ్శంభోః తేన కథం కఠోరయమరాడ్వక్షః కవాటక్షతిః
అత్యంతం మృదులం త్వదంఘ్రియుగళం
హా మేమనశ్చింతయ
త్యేతల్లోచనగోచరం కురు విభో। హస్తేన సంవాహయే॥

77. భర్త యొక్క వియోగము పొందిన భార్య ఏ విధముగా అతని నిగూర్చినమోహముచే సతతము అతనినే తలచుకొనుచు, కాలముగడుపు చుండునో, ఆ ప్రకారముగనే శివభక్తుని యొక్క బుద్ధి ఎల్లప్పుడూ శివుని యొక్క ధ్యాన, మంత్ర, జపాదుల చేత స్థిరత్వము బొందుట కొరకు, నీ పాదపద్మముల యొక్క ధ్యానము, స్మరణము, దర్శనము, సంకీర్తనము మున్నగు వాటిని గూర్చియే సతతము విచారించుచు, చివరకు నిన్నే శాశ్వతముగా పొందును.

78. హే శివ మహాప్రభో! శ్రేష్ఠమైన నీ పాదపద్మములను సేవించుటలో చక్కగా శిక్షణపొంది, వినయవిధేయతలు గలిగి, సుహృదయముతో కూడుకొని యున్నదైన నా ఈ బుద్ధిని సద్గుణముల చేతను, సదాచారములచేతను, కొత్తగా వివాహమైన భార్యనువలె, ఉద్ధరించి యోగ్యురాలుగా జేయుమా;

79. శుభంకరుడవు, సుఖప్రదాతవు అయిన ఓ శంభో! ఎల్లప్పుడూ నీ కోమల పాదయుగళములు యోగీంద్రుల మనస్సనెడి పద్మదళముల యందు నిలిచియుండును. అటువంటి మిక్కిలి మృదువైన నీ పాదములతో నీ భక్తుని కాపాడుటకు, యమధర్మరాజు యొక్క వక్షమును తన్నుట వలన నీకు కలిగిన నొప్పిని గురించి నాకు ఎంతో విచారముగా నున్నది. కనుక, ఆ నీ పాదయుగళములను నాకు గోచరింపజేయుమా! నాహస్తములతో వాటికి సేవచేసి ఆ నొప్పిని త్వరగా నివారించెదను.

80 శ్లో॥ ఏష్యత్యేష జనిం మనోఽస్య కఠినం తస్మిన్నటానీతి మ
ద్రక్షాయై గిరిసీమ్ని కోమలపదన్యాసః పురాభ్యాసితః
నోచే ద్దివ్యగృహాంతరేషు సుమనస్తల్పేషు వేద్యాదిషు
ప్రాయస్సత్సు శిలాతలేషు నటనం శంభోః కిమర్థం తవ॥

81 శ్లో॥ కంచిత్కాల ముమామహేశః భవతః పాదారవిందార్చనైః
కంచిద్ధ్యాన సమాధిభిశ్చ నతిభిం కంచిత్కథా కర్ణనైః
కంచిత్కంచి దవేక్షణైశ్చ నుతిభిః కంచిద్దశా మీదృశీం
యః ప్రాప్నోతి ముదాత్వదర్పితమనా జీవన్ సముక్తఃఖలు॥

80. కైలాస వాసుడవైన ఓ సాంబశివా! 'ఈ మానవుడు లోకమందు అతికఠిన మానసుడై జన్మించబోవు చున్నాడు. ఇట్టి కఠోరమైన మనస్సునందు నేను సంచరించ వలసి యున్నది. అందువలన నేను నా మృదువైన పాదములను కఠినమైన పర్వత ప్రదేశములందు తిరుగుట, ఈ మానవుని ఉత్పత్తికి ముందర నుంచీ అభ్యసించ వలసియున్నది' అని అనుకొని నీవు అనాది నుంచీ రమణీయములైన గృహాంతర ప్రదేశములను, పుష్పశయ్యలను, వదలి వేసి, కఠినమైన ఈశిలాప్రదేశములందు నీ పాదములు కందిపోవునట్లు తాండవనృత్యాదులు చేయుచుంటివా ఏమి? చెప్పుము. అటులగానిచో నీకీ ప్రర్వతప్రదేశ వాస మెందుకొరకు?

81. ఓ ఉమామహేశ్వరుడా! కొంతకాలము నీ పాదారవిందములను పూజించుట యందును, కొంతకాలము నీయొక్క ధ్యాన సమాధులలో గడుపుట యందును, కొంత సేపు నీకు నమస్కారములు, స్తోత్రములుచేయుట యందును, మరి కొంతకాలము మహిమాన్వితుడవైన నీ గాథలను, కథలను, శ్రవణము చేయుట యందును, మరికొంతసేపు నిన్ను దర్శించుట యందును ఏ సాధకుడు నిమగ్నుడై సంతోషముతో నీయందే సతతము మనస్సుంచబడిన వాడగునో, అటువంటి మహనీయుడు జీవన్ముక్తుడై, సర్వోత్కృష్టమైన సాయుజ్య పదవిని బొందుచున్నాడు.

82 శ్లో॥ బాణత్వం వృషభత్వ మర్ధవపుషా భార్యాత్వమార్యావతే।
ఘోణిత్వం సఖితా మృదంగవహితా చేత్యాదిరూపందధౌ
త్వత్పాదే నయనార్పణంచ కృతవాన్ త్వద్దేహభాగోహరిః
పూజ్యాత్పూజ్యతరస్సఏవ హినచేత్కోవాతదన్యోఽధికః॥

83.శ్లో॥ జననమృతియుతానాం సేవయా దేవతానాం
న భవతి సుఖలేశ స్సంశయో నాస్తి తత్ర
అజని మమృతరూపం సాంబ మీశం భజంతే
య ఇహ వరసౌఖ్యం తే హి ధన్యా లభంతే॥

84.శ్లో॥ శివః తవ పరిచర్యాసన్నిధానాయ గౌర్యా
భవః మమ గుణధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే
సకల భువనబంధో! సచ్చిదానందసింధో!
సదయః హృదయగేహే సర్వదా సంవస త్వమ్.

82 ఓయీ! పార్వతీనాధుడవైన సదాశివా! త్రిపురాంతకుడవైన నీకు ప్రీతి కలిగించుట కొరకు విష్ణువు బాణముగాను, వృషభవాహనునిగాను, నీ అర్ధ శరీరమైన అంబరూపముతో నీకు భార్యగానూ, నీపాదపద్మములను సేవించుటకు వరాహము (పంది)గాను, స్నేహితునిగాను, నీకుమృదంగ వాద్యమును వినిపించువానిగాను-అనేక రూపములను ధరించెను. ఇంతే కాక, నీ పాదపద్మములకు తన నేత్రమును పుష్పముగా సమర్పించెను. అందుచేత, అర్ధనారీశ్వరుడై నీశరీరములో ఒక భాగమైన ఆ విష్ణు భగవానుడు బ్రహ్మాదుల కంటె ఎక్కువ పూజ్యతరుడయ్యెను. అలా కానిచో, విష్ణువు కంటె అధికతరుడైన పూజ్యుడు మరి ఎవరున్నారు? ఎవ్వరూ లేరని భావము.

83. జనన మరణములతో కూడిన బ్రహ్మాది దేవతలను సేవించుట వలన ఐహిక సుఖప్రాప్తి కలుగునేమో కాని, అసలైన పరమార్ధ సుఖము లేశమైనను కలుగదు. దీనియందు సందేహమెంత మాత్రము లేదు. ఎవరైతే తమ జీవితకాలములో జననమరణ, రహితుడైన అమృతతుల్యుడును, జ్ఞానస్వరూపుడును అయిన సాంబశివుని భక్తితో సేవింతురో, అట్టివారు ఇహలోక, పరలోక సౌఖ్యములను బొంది ధన్యులగుదురు.

84. ఓ సాంబశివా! సకల లోకములకూ బంధువైనవాడా! దయామయుడా! సత్ చిదానందసింధో! అంబతో కూడియున్న నిన్ను సేవించుట కొరకు సకల సద్గుణాలతో కూడియున్న నాబుద్ధి అనే కన్యను నీకు దానముగా ఇచ్చుచున్నాను. నన్ననుగ్రహించి దానిని గ్రహింపుము. నా హృదయసీమయందు ఎల్లప్పుడూ అంబాసమేతుడవై నివసించియుండుమా!

85.శ్లో॥ జలధిమథనదక్షో నైవ పాతాళభేదీ
న చ వనమృగయాయాం నైవ లుబ్ధప్రవీణః,
అశనకుసుమభూషా వస్త్రముఖ్యాం సపర్యాం
కథయ కథ మహం తే కల్పయా నీందుమౌళే!

86.శ్లో॥ పూజాద్రవ్యసమృద్ధయో విరచితాః పూజాంకథం కుర్మహే
పక్షిత్వం న చ వా కిటిత్వ మపి న ప్రాప్తం మయా దుర్లభమ్
జానే మస్తక మంఘ్రిపల్లవ ముమా జానే! న తేఽహం విభో
న జ్ఞాతం హి పితామ హేన హరిణా తత్త్వేన తద్రూపిణా॥

87.శ్లో॥ అశనం గరళం ఫణీ కలాపో
వసనం చర్మ చ వాహనం మహోక్షః
మమ దాస్యసి కిం, కి మస్తి శంభో!
తవ పాదాంబుజభక్తి మేవ దేహి॥

85. ఓ చంద్రశేఖరా! సముద్రమును మధించుటయందు నేను సమర్థుడను గాను. పాతాళమును భేదించుటకు నాకు శక్తిలేదు. కనుక నీకాహారముగా సముద్ర మందు లభ్యమగు విషమును సమర్పించలేను నీకు ఆభరణములుగా భూగర్భమందు దొరకు సర్పరాజములనుతెచ్చి సమర్పించుటకు సమర్థుడను గాను, వనమునకేగి నిన్ను సేవించుటకు పుష్పములను వేటాడి గజ చర్మమును సంపాదించి నీకు వస్త్రముగను సమర్పింపవచ్చును. కాని వాటికి కూడా నాకు సమర్థత లేదు. కనుక నీకెట్లు పూజోపచారములు చేయగలనోచెప్పుము?

86. ఉమాపతివైన ఓ ఈశ్వరుడా! నీకు పూజ చేయుటకు అనేక రకములైన పూజా ద్రవ్యములు సంపాదించి పెట్టితిని. కాని, నీకెట్లు పూజ చేయగలను? నీ శిరముగాని పాదములు గాని, ఎచటనున్నవో నాకు తెలియరాకున్నది. పక్షి రూపమును ధరించి నీ శిరమును గుర్తించుటకును లేక వరాహరూపమును బొందినీ పాదములను తెలిసికొనుటకును నాకు సాధ్యపడదు. కనుక వాటిని నేను పొందజాలక పోతిని. పక్షి రూపమును ధరించిన బ్రహ్మచేతను, వరాహరూప మొందిన విష్ణువు చేతనూ కూడ నీ రూపము తెలిసికొన బడినదా అన్నది సందేహాస్పదమే?

87. హే శంభో! నీవు విషమును ఆహారముగ బక్షించెదవు. సర్పములను ఆభరణములుగా వేసికొందువు. చర్మమును వస్త్రముగా ధరించెదవు. వృషభము వాహనముగా గలవాడవు. ఇటువంటి దరిద్రుడవైన నీదగ్గర నాకు ఇష్టమైనది ఏమున్నది? కనుక నీపాద పద్మములయొక్క భక్తినే నాకు ఇమ్ము. నాకు కావలసినదదియేకదా!

88.శ్లో॥ యదా కృతాంభోనిధి సేతుబంధనః
కరస్థలాధఃకృతపర్వతాధిపః
భవాని తే లంఘితపద్మసంభవ
స్తదా శివార్చా స్తవ భావనక్షమః॥

89.శ్లో॥ నతిభి ర్నుతిభి స్త్వ మీశ।పూజా
విధిభి ర్ధ్యానసమాధిభి ర్న తుష్టః
ధనుషా ముసలేన చాశ్మభి ర్వా
వద తే ప్రీతికరం తథా కరోమి॥

90.శ్లో॥ వచసా చరితం వదామిశంభో
రహ ముద్యోగవిధాసు తేఽ ప్రసక్తః
మనసాఽఽకృతి మీశ్వరస్య సేవే
శిరసా చైవ సదాశివం నమామి॥

88 హే సాంబశివా! సముద్రమునందు సేతు బంధనము చేసిన శ్రీరామ చంద్రుని వలెను, అరచేతితో వింధ్య పర్వతమును అణచి వేసిన అగస్త్య మహాముని వలెను, నీయొక్క అత్యంత పరభక్తుడైన బ్రహ్మ వలెను, నేను ఎప్పుడు సమర్థుడ నగుదునో, అపుడు నిన్ను పూజించుట లోను, స్తుతించుటలోను ధ్యానించుట యందును సమర్థుడ నవుదును. అనగా, నిన్ను పూజించుట, స్తుతించుట, ధ్యానించుట యందు శ్రీరాముడు, అగస్త్యుడు, బ్రహ్మ సమర్థులైనట్లు నేనెప్పు డగుదునో, అపుడు నీకు ఆ విధముగా పూజ, స్తవ, ధ్యానాదులు చేయుటయందు సమర్థుడనగుదునని తాత్పర్యము.

89. ఓ ఈశ్వరుడా! నావలన నీవు పొందు నమస్కారములచేతను, స్తోత్రముల చేతను, పూజా విధుల చేతను, ధ్యాన సమాధుల చేతను నీవు సంప్రీతుడవుగానిచో! ధనుర్బాణము చేతనా, రోకలి పోట్ల చేతనా, లేక రాళ్ళచే కొట్టుట వలననా! నీకు దేనితో సంతోషము కలుగునో తెలుపుము. అవిమంచి పనులు కాకున్నను ఆ ప్రకారము చేసి నీ కృపా కటాక్షము లకు పాత్రుడనయ్యెదను.

90. నేను భగవంతుని యొక్క పరమార్థ భక్తి తత్వమును గురించి, వేదాంత శాస్త్రరీత్యా పరిచయము లేని వాడను. అందుచేత ఓ సదాశివా! మహనీయమైన నీ చరితమును వాక్కుచేత చెప్పుచుందును. అద్భుత మైన నీ యొక్క స్వరూపమును మనస్సుచేత సేవించుచుందును దేవ దేవుడవైన నీకు శిరముచేత వందన నమస్కారాదులు ఆచరించు చుందును. ఈ విధముగా, మనో, వాక్శిరములచేత నిన్ను నిరంతరము సేవించుచున్నాను.

91.శ్లో॥ ఆద్యావిద్యా హృద్గతా నిర్గతాసీ
ద్విద్యా హృద్యా హృద్గతాత్వత్ప్రసాదాత్
సేవే నిత్యం శ్రీకరం త్వత్పదాబ్జం
భావే ముక్తే ర్భాజనం రాజమౌళే!॥

92 శ్లో॥దూరీకృతాని దురితానిదురక్షరాణి
దౌర్భాగ్యదుఃఖదురహంకృతి దుర్వచాంసి
సారం త్వదీయచరితం నితరాం పిబంతం
గౌరీశ! మా మిహ సముద్ధర సత్కటాక్షైః.

93.శ్లో॥ సోమకళాధరమౌళౌ
కోమలఘనకంధరే మహామహసి
స్వామిని గిరిజానాథే
మామకహృదయం నిరంతరం రమతామ్॥

91. ఓ చంద్రశేఖరుడా! కరుణా సముద్రుడవైన నీ అనుగ్రహమువల్ల, నా హృదయమందు మొట్టమొదట పుట్టిన అవిద్య అనే అజ్ఞానమంతా తొలగిపోయినది. నా హృదయగ్రంధి ఛేదకమయినది. నాకు జ్ఞానోదయమైనది. అందువలన శ్రీకరమైన మోక్షపదము నిచ్చు నీ పాదకమలములను నిరంతర నిరంతరాయముగా నా హృదయమందు ధ్యానముచేయు చుందును.

92 ఓ గౌరీనాధుడా! సదాశివా! పూర్వజన్మ పాపసంస్కారము వల్ల బ్రహ్మచే నా నొసట వ్రాయబడిన దుర్లిపికి సూచకములైన దుర దృష్టకర దుఃఖ భూయిష్టమైన ఈ శరీరమే నేననుకొనెడి దేహాత్మ భావము, దుర్వాక్కులు, నీ కరుణా కటాక్ష వీక్షణములచేత దూరముగా తొలగింపబడినవి. నిరంతరము. నీ మహత్తర చరితమును మననము చేసికొనుచూ పరమానందమును పొందుచున్నాను. కనుక ఈ జన్మమందే నన్నుద్ధరింపుమా!

93. చంద్రకళను శిరమున ధరించి, అంబతో కూడియున్నవాడును, మనోహరమైన మేఘమును బోలునల్లని కంఠము గలవాడును, మహాతేజ స్వరూపుడును అయిన గిరిజానాథుడగు సదా శివస్వామి నా హృదయ సీమలో ఎల్లప్పుడూ రమించుగాక.

94.శ్లో॥ సా రసనా తే నయనే
తావేవ కరౌ స ఏవ కృతకృత్యః
యా యే యౌ యో భర్గం
వద తీక్షాతే సదార్చత స్స్మరతి॥

95 శ్లో॥ అతిమృదులౌ మమ చరణా
వతికఠినం తే మనో భవానీశ!
ఇతి విచికిత్సాం సంత్యజ
శివ! కథ మాసీ ద్గిరౌ తథా ప్రవేశః ?

96 శ్లో॥ ధైర్యాంకు శేన నిభృతం
రభసా దాకృష్య భక్తి శృంఖలయా
పురహర! చరణాలానే
హృదయమదేభం బధాన చిద్యంత్రైః॥

94. సాదా శివుని నామమైన "భర్గం" అను శబ్దమును ఎవని నాలుక నిరంతరము భక్తితో ఉచ్చరించుచుడునో, ఆ మానవోత్తముని నాలుకయే ఉత్తమమైన నాలుక. ఎవని నయనములు ఆ భార్గవుని దర్శనమందు ఎల్లప్పుడూ నియమితమైయుండునో, ఆ మానవోత్తముని కన్నులే సార్థకమైన కన్నులు. ఎవని కరములు ప్రతినిత్యము ఆ భర్గుని పూజయందు వినియోగింపబడుచున్నవో, ఆ చేతులే శ్రేష్ఠమైన చేతులు. ఏ మానవుడు నిశ్చలమైన భక్తి శ్రద్ధలతో భార్గవుని సదా స్మరించుచుండునో అతడే మానవోత్తముడు.

95. శుభంకరుడవైన ఓ భవానీపతే! అతిమృదువైన నీ పాదపద్మములను అతికఠినమైన నా హృదయ మందు ఎట్లు నిలుపుదునని సందేహింపకుము. అత్యంతకఠినమైన కైలాసపర్వతములయందు నీ మృదుపాదములెట్లు సంచరించెనో చెప్పుము? అందుచేత, ఎంత కఠినమైనను, నీ పాదారవిందములను నా హృదయమందునిలుపుమా!

96. త్రిపురహరుడవైన ఓ సాంబశివా! అరణ్యములో విజృంభించి తిరుగాడు మత్తగజమును బోలు అతిచంచల స్వభావముగల నా హృదయమును నీ మీద నాకుకలిగిన అన్యమొల్లని భక్తి అనే పగ్గముతో కదలకుండ కట్టివేసి, అచటనే యంత్రము వంటి శివజ్ఞానముచే కదలకుండ సిరముగా నుండునట్లుచేయుమా!

99. శ్లో॥ఇదం తే యుక్తం వా పరమశివ! కారుణ్యజలధే!
గతౌ తిర్యగ్రూపం తవ పదశిరో దర్శనధియా
హరిబ్రహ్మాణౌ తౌ దివి భువి చరంతౌ శ్రమయుతౌ
కథం శంభో!స్వామిన్ కథయ మమ వేద్యోఽసి పురతః॥

100. శ్లో॥స్తోత్రేణాల మహం ప్రవచ్మి న మృషా దేవా విరించ్యాదయ
స్తుత్యానాం గణనాప్రసంగసమయే త్వా మగ్రగణ్యం విదుః
మాహాత్మ్యాగ్రవిచారణప్రకరణే ధానాతుషస్తోమవ
ద్ధూతా స్త్వాం విదురుత్తమోత్తమఫలం శంభో ! భవత్సేవకాః॥

99. ఓ పరమశివా! కరుణాసాగరా! మహత్తరమైన నీ స్వరూపమును దర్శించవలెనని ఇచ్ఛతో శ్రీమహా విష్ణువు భూమియందు నీ పాదములను గాంచుటకు వరాహ (పంది)రూపమును, బ్రహ్మ నీ శిరస్సును ఆకాశమందు చూచుటకు హంస రూపమును ధరించి అనేక శ్రమలు పడినారు. కాని వారు నీ శిరమును గాని పాదములను గాని దర్శించ లేకపోయిరి. అటువంటప్పుడు ఓ శంభో! శివస్వామీ! అటువంటి అనంతమహాస్వరూపుడవైన నీవు నాకెట్లు దర్శన మీయగలవో, నేనెట్లు నీ దర్శనభాగ్యమును పొందగలనో నాకు తెలియజెప్పుమా!

100. శుభంకరుడవు, సుఖప్రదాతవు అయిన ఓ శంభో! సర్వలోకములలోను, ప్రార్థన స్తోత్రాయలచే స్తుతించుటకు సర్వోత్కృష్టమైన మహాత్ములలో మొదటి వారెవరు కాగలరని నిర్ణయించుటకు భక్తులందరూ ఒకచోట చేరి ఎంపికచేయు ప్రసంగ సమయమున, నిన్ను అందరికంటే అగ్రగణ్యునిగా తెలిసికొనినారు. ధాన్యపు కుప్పనూర్చిన తరువాత ఆ నూర్చిన ధాన్యమును చేటలో ఎగురవేయునపుడు, అందుగల పొల్లు గాలికి కొట్టుకొనిపోయి దూరముగాపడి, ధాన్యము మాత్రము క్రిందనున్న కళ్ళములో పడునట్లు, అందరికంటే మహా మహిమాన్వితుడవు నీవే అని నిర్ణయింపబడి కళ్ళములోపడ్డ ధ్యానమువలె నిలువగా ఇతర దేవతలందరూ పొల్లువలె దూరముగా జరిగిపోయిరి.

ఓం తత్ సత్

శివానందలహరి సమాప్తం

97.శ్లో॥ ప్రచర త్యభితః ప్రగల్భవృత్త్యా
మదవా నేష మనఃకరీ గరీయాన్
పరిగృహ్యా నయేన భక్తిరజ్జ్వా
పరమః స్థాణుపదం దృఢం నయాముమ్॥

98 శ్లో॥ సర్వాలంకార యుక్తాం సరళ పదయుతాం సాధువృత్తాం
సువర్ణాం
సద్భిస్సంస్తూయమానాం సరసగుణయుతాం లక్షితా
లక్షణాఢ్యామ్
ఉద్యద్భూషా విశేషా ముపగత వినయాం ద్యోతమానార్థ
రేఖాం
కల్యాణీం దేవః గౌరీప్రియః మమ కవితా కన్యకాం త్వాం
గృహాణ॥

97. శాశ్వతుడవైన ఓ పరమ శివా! స్వేచ్ఛా విహారముచే తనకడ్డు వచ్చిన వాటిని ధ్వంసముచేయుచూ, తనకు కూడ హానికరముగా ప్రవర్తిస్తూ సంచరించు మదపుటేనుగును పగ్గములతోను గొలుసులతో కట్టివేసి దాని గమనములను ఆపివేయునట్లు, అజ్ఞానముచే విషయ వ్యాపారము లందు విచ్చలవిడిగా ప్రవర్తించుచు, నానా యాతనలు పడుచున్న నా మనస్సును, నాకు నీయందు జనించిన భక్తి అనే తాడుతో బంధించి దానిని నీ అధీనము చేసుకొనుమా!

98. ఓ గౌరీప్రియుడా! సాంబశివా! సత్ సాంప్రదాయ కుటుంబమున జన్మించి, సర్వాలంకారములతో శోభిల్లుచూ. మందగమనయై, సుందర రూపియై సత్కార్యములు చేయుచు, సద్గుణములతో వినయవిధేయతలుకలిగి, శోభిల్లుచు, సర్వావయవముల యందు అదృష్ట చిహ్నములు, శుభ లక్షణములు కలిగియున్న కన్యక ఏ విధముగా వివాహము చేసుకొనుటకు బహుయోగ్యురాలగునో, అదే విధముగా నేను రచించిన ఈ శివానంద లహరి యను కవితాకన్య అనేక అలంకార విశిష్టకావ్య లక్షణములుగలదై శోభిల్లుచూ అలరారుచున్నది. కావున మహనీయుడవును, సర్వైశ్వర్య సంపన్నుడవును, అయిన నీకు భక్తితో ఈ కావ్య కన్యకను సమర్పించు చున్నాను. కాబట్టి ఆమెను స్వీకరింపుమా!